ప్రమోషనంటే యిదా—అనుకుందామె.

శ్రీమతి లహరి స్థానంలో తన్నూహించుకోగానే ఆమెకేదోలా అనిపించింది. చంచల అభిప్రాయంలో తప్పు చేయడం కంటె—తప్పుచేసే విధానం శిక్షణగా యివ్వడం సిగ్గుచేటు పని!

లహరి అంటే ఆమె మనసులో నీచమైన భావముందేది.

"ప్రమోషనంటే నీ కిష్టమే కదూ!" అన్నాడు బాస్.

ఏమనాలో తెలియలేదు చంచలకు.

బాస్ ఆమె ముందు కో ఫైలు తోశాడు.

"ఇష్టమైతే రేపట్నుంచే నీ డ్యూటీ ప్రారంభం. ఇందులో నలుగురు యువతుల ఫోటోలు, వివరాలు ఉన్నాయి. కాబోయే నీ శిష్యురాండ్రు వారు. చదువుకో నీ అభిప్రాయం చెప్పు అక్కడ అలా సోఫా మీద కూర్చుని నీ సమయం నీవు తీసుకో. ఈలోగా నేను నా పని నేను చూసుకుంటాను...." అన్నాడు బాస్.

చంచల మాట్లాడకుండా ఫైలందుకొంది. వెళ్ళి సోఫాలో కూర్చుంది. ఫైలు తెరిచింది.

మొదటి పేజీలోని యువతి మార్గరెట్.

ఫోటో చూస్తూనే ఉలిక్కిపడింది చంచల.

మార్గరెట్ ఆమెకు బాగా తెలుసు.

సరిగ్గా నాలుగిళ్ళకు పక్కగా ఉంటుందామె యిల్లు చంచలింటికి!

ఆమె చంచలను—అక్కా—అని పిలుస్తుంది. తరచుగా చంచల యింటికొచ్చి ఎన్నో విశేషాలడిగి తెలుసుకుని వెడుతుంది.

చంచల అంటే ఆమెకు ఆరాధన!

నాలుగురోజుల క్రితమామె చెప్పింది తన కుద్యోగం వచ్చిందని!

ఉద్యోగం తన సంస్థలో కాదు.

చంచల ఫైలు మూసి—బాస్ దగ్గరకు వెళ్ళి—"అందులో మన సంస్థకు సంబంధించని ఉద్యోగులున్నారు—" అంది.

బాస్ నవ్వి—"స్టేట్ బ్యాంకు ఉద్యోగులకి స్టేటు బ్యాంకే శిక్షణ నివ్వనవసరంలేదు. బ్యాంకుద్యోగులందరికీ శిక్షణ నివ్వడానికో సంస్థవుంది...." అన్నాడు.

"అంటే?"

"మేమందరం ఒకే గూటి పక్షులం. కొన్ని మాకు అనుబంధ సంస్థలు కొన్ని మాపై ఆధారపడ్డ సంస్థలు. మాకు సెంట్రలైజ్డ్ ఫెసిలిటీస్ ఉన్నాయి...."

చంచల యేదో అనబోగా—"అప్పుడే ఫైలంతా చూసేశావా?" అన్నాడు బాస్.

"లేదు. ఇంకా మొదటి పేజీలో ఉన్నాను—" అంది చంచల.

"మొత్తం పేజీలన్నీ చూసి అప్పుడు నీ అభిప్రాయం చెప్పు...."

చంచల మాట్లాడకుండా వెళ్ళి మళ్ళీ సోఫాలో కూర్చుంది.

ఉద్యోగంలో చేరాక ఆమెకు సహనం, నెమ్మదితనం అలవడ్డాయి.

మరోసారి ఫైలు తెరిచింది.

రెండో పేజీలో—

మరింత ఉలిక్కిపడింది చంచల.

అందులో సుభద్ర ఉంది.

సుభద్ర స్వయానా చంచల చెల్లెలు.

చంచల తలిదండ్రులకు ముగ్గురు పిల్లలు.

పెద్దవాడు గోపాల్ బాగా చదువుకుని మంచి ఉద్యోగం సంపాదించాడు. బొంబాయిలో పెద్ద కంపెనీలో ఉద్యోగం. నెలకు నాలుగైదు వేలొస్తుంది. ఉద్యోగానికి ముందే అతడికి పెళ్లయింది. ఉద్యోగం వచ్చే దాకా అత్తమామల కణిగిమణిగి ఉండేది చంచల వదిన లత. ఉద్యోగం రాగానే ఆమెకు భయం పట్టుకుంది. అత్తమామలు కూతుళ్ళ పెళ్ళి పేరిట తన్ను దోచేస్తారేమోనని! ఆమె అందం కంటే స్వార్థమే ఎక్కువగా ఆకర్షించడంతో—గోపాల్ లతకు బానిసయ్యాడు.

ఆ సమయంలో తండ్రికి జబ్బు చేసింది. ఆయన ఉద్యోగం ఊడింది.

చంచల గోపాల్ కంటె పదేళ్ళు చిన్నది. సుభద్ర చంచల కంటె నాలుగేళ్ళు చిన్నది.

అన్నగారి నుంచి ఏ సాయమూ అందక—వదిన పరుషంగా మాట్లాడిందని అలిగి—పౌరుషంలో ప్రయత్నాలు చేసి ఉద్యోగం సంపాదించింది చంచల. రెండేళ్లలోనే కుటుంబ పరిస్థితులు చక్కబడ్డాయి.

ఇంటి పరిస్థితుల నెప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉంది లత. అక్కడ పరిస్థితులు చక్కబడ్డాయనగానే ఆమె అత్తమామల్ని కాకా పట్టసాగింది.

"చంచల దగ్గర డబ్బు చేరింది. తన పెళ్ళి తనే చేసుకోగలదు. పెళ్ళయ్యాక ఆడపిల్లింట్లో ఉండలేరు మీరు. ఎప్పటికయినా కొడుకే విధాయకం. మా ఇంట్లో

ఉండడం మీ వాళ్ళ. వచ్చి మాతో ఉండండి—”
అందామె.

అందుక్కారణ ముంది.

లత కూడా కొత్తగా ఉద్యోగంలో చేరింది. ఇంట్లో మనుషుల అవసరం.

బయటివారికయితే జీత మిచ్చుకోవాలి. నమ్మక ముండదు.

అత్తమామలైతే నమ్మకంగా ఉంటారు. చాకిరీ చేస్తారు. వారికేమిచ్చినా అది తమ బాధ్యతే అవుతుంది. అంతా మెచ్చుకుంటారు.

లత అత్తమామల్ని బాగా చూసుకునేది.

అత్తమామలామె దగ్గరే ఉండేవారు. కూతురి పెళ్ళి గురించి తరచుగా ఆలోచిస్తూండేవారు. ఆమె వారికి నచ్చచెబుతూండేది.

సుభద్ర అక్క దగ్గరే ఉంటోంది.

అక్కంటే ఆమెకు ఆరాధన!

“అక్కా! నీకులాగే నేనూ ఉద్యోగంలో ప్రవేశించి నా కాళ్ళమీద నేను నిలబడతాను. అమ్మనూ, నాన్ననూ ఆదుకుంటాను—” అనేది సుభద్ర.

“వద్దమ్మా! నాకు తప్పనసరై ఉద్యోగంలో చేరాను. నీకా కర్మ పట్టలేదు. నీ పెళ్ళి నేను చేస్తాను. నా కంటే ముందు నీ పెళ్ళి జరుగుతుంది—” అనేది చంచల.

సుభద్ర మాట్లాడేది కాదు. కాని ఆమె ఉద్యోగానికి అప్లై చేసింది. నాలుగు నెలల క్రితం ఉద్యోగంలో చేరింది.

“కంట్రాక్టు రాయకు—” అని సలహా యిచ్చింది చంచల.

"కంట్రాక్టేమీ లేదు—...." అంది సుభద్ర.

ఉద్యోగంలో ఆమె డ్యూటీ లేమిటో గుచ్చి గుచ్చి అడుగుతూండేది చంచల. సుభద్ర సమాధానా లామెకు తృప్తికరంగానే ఉండేవి. కానీ మనసులో ఏదో భయం....

ఇప్పుడు ఫైల్లో సుభద్ర ఫోటో!

చంచల ఫైలు మూసేసింది.

సుభద్రకు తను శిక్షణివ్వాలి—పురుషుల్నెలా ఆకర్షించుకోవాలో! ఎలా ఆకట్టుకోవాలో!! వారినెలా తమకు బానిసల్ని చేసుకోవాలో!!!

ఏ అక్కా కోరుకోని శిక్ష యిది!

ఏ అక్కకైనా శిక్ష యిది!

చంచల లేచి బాస్ దగ్గరకు వెళ్ళి "బాస్! నాకు ప్రమోషన్ వద్దు—" అంది.

బాస్ చూస్తూన్న ఫైలుని మూసి—"ఏం—పాత డ్యూటీలే బాగున్నాయా?" అన్నాడు.

చంచల జవాబివ్వలేదు.

"అయాం సారీ చంచలా! ప్రమోషన్ ఒప్పుకోకపోతే—నీకీ ఉద్యోగం మరో నాలుగు మాసాలు మాత్రమే ఉంటుంది...." అన్నాడు బాస్.

"ఎందుకని?"

"అది సంస్థ నియమావళి!"

చంచల ఆలోచించకుండా—"నేనిక్కడ ఉద్యోగం కొనసాగించగలను. కానీ ప్రమోషన్ వద్దు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ ప్రమోషన్ అంగీకరించలేను—" అంది.

"అందుకోకే ఒక్క ఉపాయముంది. శ్రీమతి లహరి ఈ ఉద్యోగానికి రాజీనామా చేసింది. ఆమెను మరి

కొంత కాలం ఉద్యోగంలో కొనసాగించడానికి ఒప్పించు...."

"అది నావల్ల నవుతుందా?"

"నీవల్లనైనా కాకపోయినా అది నీ కవసరం...."

చంచల ఆలోచనలో పడింది.

"నీతో మాట్లాడ్డానికి నా కెక్కువ సమయం లేదు. నువ్వు అర్జంటుగా వెళ్ళి శ్రీమతి అహారిని కలుసుకో. రేపటికల్లా నా కే విషయం చెప్పాలి. ఇప్పుడు శ్రీమతి అహారి ఇంట్లో ఒంటరిగా ఉంటుంది. నీవు బయటకు వెళ్లడానికి అనుమతిస్తాను. వెళ్ళి కలుసుకోరాదూ?" అన్నాడు బాస్.

చంచల బాస్ వంక చూసింది.

అతడి కళ్ళలో విసుగు కనబడుతోంది.

చంచల జాప్యం చేయకుండా అక్కణ్నుంచి కదిలింది.

## 2

"నేను రాజీనామా చేయలేదు. ఉద్యోగం నుంచి నా కుద్వాసన జరిగింది—" అంది అహారి.

చంచల ఆశ్చర్యపడి — "మరి బాస్ అలా చెప్పాడేం?" అంది.

"వాళ్ళ భాష అలాగే ఉంటుంది...." అంది అహారి నిట్టూర్చి.

"మీ ఉద్యోగం మీకు నచ్చిందా? ఇందులో కొనసాగడం మీ కిష్టమేనా?"

"ఇలాంటి ఉద్యోగం మనబోటివాళ్ళకు నచ్చదు. కానీ తప్పదు కదా! నేను నా భర్త కెన్నోసార్లు నచ్చచెప్పాను. ఆయన నా కంటే యెక్కువగా నా ఉద్యో

గాన్ని ప్రేమిస్తున్నాడు. భార్యాభర్త లిద్దరూ కలసి సంపాదించి బాగుపడాలనే సిద్ధాంత మాయనది! ఇప్పుడీ ఉద్యోగం పోతే—మరో ఉద్యోగం దొరికేదాకా—ఇంట్లో శాంతి ఉండదు—...."

చంచల కామెను చూస్తూంటే జాలివేసింది—"మిమ్మల్ని చూస్తూంటే నేను పెళ్ళికి ముందే ఈ ఉద్యోగాన్ని వదలిపెట్టడం మంచిదనిపిస్తోంది...." అందామె.

"మర్యాదగా వదిలిపెట్టడం మంచిది. వాళ్ళే నీ కెలాగూ ఉద్వాసన పలుకుతారు—...."

చంచల ఆశ్చర్యంగా—"నేను వద్దన్నప్పుడు కదా—వాళ్ళు పొమ్మనేది...." అనడిగింది.

"వాళ్ళ భాష నీకు తెలియదు...."

"వాళ్ళ భాషంటే?" అంది చంచల.

"ఉదాహరణకు వాళ్ళు నిన్ను నా దగ్గరకు పంపింది-నా రాజీనామా అపడానిక్కాదు. నిన్ను రాజీనామాకు ప్రోత్సహించడానికి!"

చంచల ఆశ్చర్యంగా—"నేను నమ్మలేను...." అంది.

"నేను చాలా ఏళ్ళుగా ఈ ఉద్యోగంలో ఉన్నాను. సంస్థకు పనికివచ్చే విధంగా నేనెందరో యువతులను తయారుచేశాను. అయితే సంస్థకు పనికివచ్చే వ్యక్తులు నా కంటే ఎక్కువ కాలంగా—అవే హోదాల్లో ఉన్నారు. వారికి పదవులు మారుతూండాలి. అందుకే శిక్షణ నిచ్చే వారు కొత్త కొత్త పద్ధతులు నేర్పుతూండాలి .... నా దగ్గర భావాల కొరత ఏర్పడినట్లు సంస్థ భావించి నా స్థానంలో మరొకర్ని నియమించదల్చుకున్నారు. నన్ను రాజీనామా యివ్వమన్నారు. అలాగేనా నీ విషయం

లోనూ...."

"నా విషయంలో రాజీనామా యివ్వమని అడగ లేదుగా...."

"చెప్పానుగా—వాళ్ళ భావ వేరే ఉంటుందని.... బహుశా నాలుగు నెలల్లో నీకు ఇరవై రెండు నిండుతాయి. అవునా?"

చంచల ఓ క్షణం ఆలోచించి ఆశ్చర్యంగా—"అవును. మీకెలా గుర్తుంది?" అంది.

"సంస్థలో నీవంటి యువతికి వయోపరిమితి ఇరవై రెండేళ్ళు. అది సంస్థ నియమావళి—" అంది లహరి.

అంటే తన్ను నాలుగు నెలల తర్వాత ఉద్యోగం వదులుకోమని చెప్పడానికి కారణమిదన్న మాట—అనుకుంది చంచల.

"నీ ఉద్యోగం నాలుగు నెల్ల తర్వాత పోతుంది. కంట్రాక్టులో ఉన్నావు కాబట్టి నిన్నూరికే పొమ్మనడం వారి కిష్టంలేదు. అందుకే నా ఉద్యోగం నీ కాఫర్ చేశారు. అందులో నీవు కొనసాగడం వారి కిష్టమైతే—బాస్ నీకిచ్చే ఫైల్లో వేరే ఫోటోలుండేవి. ఏ ఫోటోలు చూపితే నీవీ ఉద్యోగాని కొప్పుకోవో ఆ ఫోటోలు నీకు చూపించారు...."

చంచల ఆశ్చర్యంగా—"ఇదంతా ఒక పథకం ప్రకారం చేస్తున్న పనా?" అంది.

"అఫ్కోర్స్! మార్గరెట్, సుభద్రల ఫోటోలు—ఆ ఫైల్లోకి కాకతాళీయంగా వచ్చేయనుకుంటున్నావా?" అంది లహరి.

చంచల నిట్టూర్చి—"అయితే నేను ప్రమోషన్ కొప్పేసుకుంటాను' ఏం జరుగుతుందో చూస్తాను...."

అంది.

"చూడ్డానికేం లేదు. వాళ్ళు సర్వసమర్థులు. మార్గరెట్‌నీ, సుభద్రనీ—నీకు శిష్యురాండ్రను చేయగలరు. నువ్వెందుకు సిద్ధపడి ఉన్నావా?" అంది లహరి.

చంచల తెల్లబోయింది.

"మిస్ చంచలా! సంస్థలో నీ డ్యూటీ చేయడం మినహా నీవు లోకజ్ఞానం అలవర్చుకోలేదనిపిస్తుంది నాకు. మార్గరెట్, సుభద్రలు చేస్తున్నది నీ లాంటి ఉద్యోగం కాదు. వారిని నీకులా మార్చగలమని వారు నిన్ను హెచ్చరిస్తున్నారు. మార్గరెట్, సుభద్రలతో నీకున్న అనుబంధం వారికి తెలుసు. వారి భవిష్యత్తు గురించి నీవీ ఉద్యోగాన్ని వదులుకోగలవని వారి నమ్మకం— ..." అంది లహరి.

చంచల ఆలోచిస్తూ—"నే నిప్పుడేం చేయాలి?" అంది.

"సంస్థకు నీపై ఆసక్తి లేదు. నా సలహా ఏమిటంటే నాలుగు నెలలలోగా నీవు వేరే ఉద్యోగమేదైనా చూసుకోవడం మంచిది—" అంది లహరి.

"ఎల్లకాలమూ ఉద్యోగమేనా? నాకు జీవితంలో స్థిరపడాల నుంది—" అంది చంచల స్వగతాన్ని బైట పెడుతూ.

"ఆడదానికి జీవితంలో స్థిరపడడమంటే పెళ్ళి—.... నీ ఉద్దేశ్యం కూడా అదేనా?"

"మీ సలహా ఏమిటి?"

"పెళ్ళి చేసుకో—" అంది లహరి.

"నాకు పెళ్ళి కాదు—" అంది చంచల.

"ఎందుకని?"

చంచల తనింటి పరిస్థితులు చెప్పి—"అమ్మా నాన్న లకు కదినంటే భయం, నా పెళ్ళి నేనే చేసుకుంటానని కదినంటే వాళ్ళు నమ్మతారు...." అంది.

"అవును—నీ పెళ్ళి నువ్వే చేసుకో!" అంది చంచల.

"ఎలా?"

లహరి చిరాగ్గా—"అందుకే కంపెనీ నీ వుద్యోగ మూడపీకాలనుకుంటోంది ..." అంది.

"అవును—....నా పెళ్ళి నేనే యెలా చేసుకుం టాను?"

"ఎలాగేమిటి? నేనిచ్చిన శిక్షణ ఎందుకు? నువ్వు సంస్థ ప్రయోజనాల కోసమే తప్ప—నీ ప్రయోజనానికి నా శిక్షణ నుపయోగించుకోలేవా?"

"అంటే?"

"ఓ మంచి కుర్రాడి నెన్నుకుని వల విసురు. అతణ్ణే పెళ్ళి చేసుకుని సుఖంగా జీవించు—" అంది లహరి.

"అరే—ఇలాంటి ఆలోచన నా కెప్పుడూ రాలేదే?" అంది చంచల.

"తమ శక్తి నితరుల కోసం ధారపోయాలనుకునే వారు సామాన్యులుగా మిగిలిపోతున్నారు. స్వప్రయోజ నాల కోసం వాడుకునే స్వార్ధపరులు నాయకులవు తున్నారు...." అంది లహరి బాధగా నిట్టూర్చి.

"మీ సలహాకు, సూచనకు, హెచ్చరికకు చాలా చాలా థాంక్స్—" అంటూ చంచల అక్కణ్ణించి లేచింది.

# 3

కృష్ణమోహన్ ట్రయిన్ లోంచీ ప్లాట్ ఫారంమీద దిగి చుట్టూ చూశాడు, ఓ క్షణం తటపటాయించి ముందుకు నడిచాడు. టికెట్టివ్వాల్సిన చోటకు వచ్చేసరికి ఓ వ్యక్తి అతడికి ఎదురై—"సార్—వచ్చేశారా?" అన్నాడు.

కృష్ణమోహన్ అతడివంక చూసి—"నువ్వా—సీతాపతీ—నా ఉత్తరమందిందా—ఎలా సాగా వున్నావా?" అన్నాడు.

"ఉత్తరమందింది—ఏమిటి విశేషం సార్! మీ కూడా సామానేం—లేదే" అన్నాడు సీతాపతి.

"ముందు మనింటికి పోదాం—" అన్నాడు కృష్ణమోహన్.

ఇద్దరూ టికెట్ గేట్లోంచి బైటకు వచ్చారు. కృష్ణమోహన్ ట్రయిన్ టికెట్టిచ్చాడు సీతాపతి ప్లాట్ ఫారం టికెట్టిచ్చాడు.

బయట కారు సిద్ధంగానే వుంది. డ్రైవర్ డోర్ తెరవగానే యిద్దరూ బ్యాక్ సీట్లో కూర్చున్నారు.

"విశేషాలేమిటి సార్ ...." అన్నాడు సీతాపతి.

"ఇంట్లో మాట్లాడుకొందాం—" అన్నాడు కృష్ణమోహన్.

ఇద్దరూ యిల్లు చేరుకున్నారు.

చిన్న బంగళా అది.

కృష్ణమోహన్ అందులో ప్రవేశించి ఓ గదిలోకి వెళ్ళాడు. హోటల్ రూంలా సకల సదుపాయాలూ ఉన్నాయందులో.

అతడు త్వరగా బట్టలు మార్చుకుని స్నానం చేసి

లుంగీ, బనియన్‌లు ధరించాడు. ఆ సరికి టిఫిన్ తీసుకుని వచ్చాడు సీతాపతి.

ప్లేట్‌లో వేడి వేడి ఇడ్లీలు, కారప్పొడి. చట్నీ....

“పనివాళ్ళు లేరా?” అన్నాడు కృష్ణమోహన్.

“మీకు సంబంధించినంత వరకూ నేనే పని వాణ్ని—....”

కృష్ణమోహన్ చిరునవ్వు నవ్వి—“హద్దులు మీరితే వినయం అతివినయమనిపించుకుంటుంది. అతివినయం మంచివాళ్ళ లక్షణం కాదు....” అన్నాడు.

“మీరేమనుకున్నా నా లక్షణాలు మారవు. నా ప్రవర్తన సామెతలను సరిదిద్దగలదు—....” అన్నాడు సీతాపతి.

అందులోని నిజం కృష్ణమోహన్‌కు తెలుసు.

రమాపతి, సీతాపతి అన్నదమ్ములు. కృష్ణమోహన్ కుటుంబాని కెంతో నమ్మకస్థులు వారు. అన్నివిధాలా సర్వసమర్థులు. కానీ కృతజ్ఞతకు కట్టుబడి కృష్ణమోహన్‌కి బానిసలు.

కృష్ణమోహన్‌కి బానిసత్వం గిట్టదు.

కృతజ్ఞతో, రక్తసంబంధమో — బానిసత్వానికి ప్రోత్సహించడం మన సంప్రదాయం. యుధిష్ఠిరుడి తమ్ములు అన్నకు బానిసలయినా—వారి సమర్థతకు గుర్తింపు, వ్యక్తిత్వాలకు గౌరవం తక్కువ కాలేదు.

రమాపతి సీతాపతి తాము యుధిష్ఠిరుని తమ్ముల ఒరవడిలో నడువదల్చినట్లు కృష్ణమోహన్‌కు చెప్పారు.

ఇద్దరూ వేర్వేరు నగరాల్లో కృష్ణమోహన్ వ్యాపార వ్యవహారాలు చూస్తున్నారు.

కృష్ణమోహన్ పెద్దగా శ్రమపడడు. అతడప్పుడప్పుడు

పైపై వ్యవహారాలు చూస్తాడు. జీవితంలో సుఖపడతాడు. రమాపతి, సీతాపతి తమ తమ జీవితాలను వ్యాపారానికి అంకితం చేశారు. వచ్చిన లాభాలలో పావలా వాటాతో తృప్తిపడతారు—మిగతా దంతా కృష్ణమోహన్ ది.

కృష్ణమోహన్ కి వివాహమై నాలుగు సంవత్సరాలయింది.

చాలామందికి కృష్ణమోహన్ వున్న వేర్వేరు నగరాల వ్యాపారం గురించి తెలియదు. అందరూ అనుకునేది కృష్ణమోహన్ వ్యాపార వ్యవహారాలు రమాపతి చూస్తున్నాడని! సీతాపతి గురించి ఎందరికో తెలియదు. వివాహమైన నాలుగు సంవత్సరాల కింకా అతడి భార్యకూ యీ విషయం తెలియదు.

"విశేషాలు చెప్పండి సార్—...." అన్నాడు సీతాపతి.

"నువ్వీ యింట్లో వుండడం లేదా?" అన్నాడు కృష్ణమోహన్.

"మీ దయవల్ల నేనీ యింట్లో వుండనవసరం లేదు. వేరే స్వంతిల్లు కట్టుకున్నాను...." అన్నాడు సీతాపతి.

"ఇందులో నా దయేముంది? పదేళ్ళుగా వ్యాపార వ్యవహారాలన్నీ నువ్వే చూస్తున్నావు. చిన్న వ్యాపారాన్నీ స్థాయికి తెచ్చావు—" అన్నాడు కృష్ణమోహన్.

"ఆధారం చూపింది మీరు—" అన్నాడు సీతాపతి వినయంగా.

కృష్ణమోహన్ తన అదృష్టాన్ని తనే అభినందించుకున్నాడు.

లంచం తీసుకున్నాడన్న నేరంమీద ఉద్యోగం

పోగొట్టుకొని సంసారాన్ని నడివీధిపాలు చేశాడు చలపతి. ఆ చలపతి కాశ్రయమిచ్చి దారి చూపించాడు విశ్వమోహన్.

కృష్ణమోహన్ విశ్వమోహన్ కొడుకు.

రమాపతి, సీతాపతి—చలపతి బిడ్డలు. చిన్నతనం నుండీ చలపతి తన బిడ్డలకు కృతజ్ఞతను నూరిపోశాడు.

ఫలితంగా కృష్ణమోహన్ సుఖపడుతున్నాడు.

"విశేషాలు చెప్పండి సార్...." అన్నాడు సీతాపతి.

"ముఖ్య విశేషం—బహుశా నేనిక్కడే ఉండి పోతాను...."

"అంటే?"

"అక్కడి వారికి సీతాపతి తెలియదు. ఇక్కడి వారికి రమాపతి తెలియదు. ఇంతకాలం నేను రమాపతికి యజమాని. ఇప్పుడు నేను నీ యజమానిని...."

"మరి అమ్మగారు?"

"అమ్మగారక్కడే ఉంటారు...."

సీతాపతి ఆశ్చర్యంగా — "అమ్మగారక్కడుంటే మీ రిక్కడెలాగుంటారు?" అన్నాడు.

"అది నీకు చెప్పను. నువ్వు అడక్కూడదు—" అన్నాడు కృష్ణమోహన్.

భార్య అతడి కళ్ళముందు మెదిలింది.

సూర్యప్రభ ఆమె పేరు. పేరుకు తగ్గట్టే సూర్య తేజంతో వెలిగిపోతుందామె.

"ప్రభా! భయంకరమైన జబ్బు నన్నావహించింది. ఈ దేశంలో దీనికి వైద్యం లేదు. నా జబ్బు గురించి ఎవరికీ తెలియడం నా కిష్టంలేదు. అందుకే రహస్యంగా వెడుతున్నాను. వ్యాపార వ్యవహారాలన్నీ రమాపతి

చూస్తూంటాడు. అర్నెల్లదాకా నానుంచి నీకే సమాచారమూ అందదు. ఆ తర్వాత నేను బ్రతికేదీ లేనిదీ తెలుస్తుంది—....” అని ఆమె దగ్గర వీడ్కోలు తీసుకున్నాడు కృష్ణమోహన్.

భర్త తనను విడిచి వెడుతున్నాడని ఆమెకు తెలియదు.

“కొంతైనా నాకు చెప్పండి-” అన్నాడు సీతాపతి.

“నే నిక ఇక్కడే ఉండిపోతాను. ఇక్కడ కొత్త జీవితం ప్రారంభిస్తాను. ఈ విషయం నీ అన్నకు తెలుసు. ఇంకెవ్వరికీ తెలియదు. నా భార్యకూడా!”

“మీరామెను విడిచిపెట్టేస్తున్నారా?”

“ఆ విషయం నన్నేమీ అడగొద్దు....”

“పోనీ—ఇక్కడింకో పెళ్ళిచేసుకుంటారా?”

“నాకై నేను పెళ్ళిప్రయత్నాలేం చేయను. కానీ ఏ అమ్మాయైనా నాపై వల విసిరితే అది వేరే సంగతి....”

## 4

విశాలమైన పార్కులో రెండు గులాబుల మధ్య నిశ్శబ్దంగా కూర్చున్నాడతడు. అతడి చూపులదోరకంగా ఉన్నాయి.

అతడు మనుషుల్ని చూడ్డంలేదు, ప్రకృతినీ చూడ్డం లేదు.

తననే చూస్తున్న చంచలనీ చూడ్డంలేదు.

చంచల మాత్రం అతడినే చూస్తోంది. ఆ చూపులు వల ఆకారంలో అతడి చుట్టూ తిరుగుతున్నాయి.

ఆమె అతణ్ని నాలుగురోజులుగా గమనిస్తోంది.

అతడికి కారుంది. అతడికింద మనుషులున్నారు.

అతడు డబ్బున్నవాడనడంలో ఆమెకు సందేహం లేదు.

అతడి నడకలో, మాటలో, చూపులో సంస్కార ముట్టిపడుతోంది.

సంసారపక్షం భాగ్యవంతుడతడని ఆమె గ్రహించింది.

నాలుగు రోజుల్లో ఆమె అతడి గురించి చాలా సమాచారం సేకరించింది. అతడి పేరు కృష్ణమోహన్ అని తెలుసుకుంది.

ఈరోజామె అతణ్ని పలకరించాలనుకుంటోంది.

కానీ ఎదుట నిలబడ్డా అతడామెను చూడ్డంలేదు.

ఆమె అతణ్ని సమీపించి ఎదురుగా కూర్చుంది. అతడు కనీసం ఉలిక్కిపడనైనా లేదు.

అప్పుడామె అతడి కళ్ళలో లీలామాత్రంగా విషాదాన్ని చూసింది.

"హలో!" అందామె.

అతడులిక్కిపడి ఆమెను చూశాడు.

కళ్ళు చెదిరే అందం....మనసు చెదిరే రూపం....

"నా పేరు చంచల..." అందామె.

అతడు మాట్లాడకుండా ప్రశ్నార్థకంగా ఆమె వంక చూశాడు.

"నీతో స్నేహాన్ని కోరుతున్నాను—" అందామె.

"ఎందుకు?" అన్నాడతడప్రయత్నంగా.

"నువ్వు నన్ను పరీక్షగా చూడలేదు. చూస్తే నీ కళ్ళలోలాంటి విషాదమే నా కళ్ళలోనూ కనబడేది నీకు..." అందామె.

అతడు తడబడ్డాడు—"నా కళ్ళలో విషాదమా?"

"మనం—ఒకే గూటిపక్షులం—" అందామె.

"నా గురించి నీకేం తెలుసు?"

"నా కథ చెబుతాను విను. నీదీ అలాంటి కథే

అయుండాలి...." అందామె.

అతడామె కథ వినడానికి సిద్ధపడ్డాడు.

"ఆడపిల్లకి దేశంలో విలువ, గౌరవం లేదు. అమ్మా, నాన్నా కష్టాల్లో వుంటే అన్నయ్య ఆదుకోలేదు. నేనుద్యోగం సంపాదించి ఆదుకున్నాను. ఇప్పుడన్నయ్యకమ్మా నాన్నల అవసరమొచ్చింది. వాడు మగపిల్లవాడు కాబట్టి వాడిదగ్గరకు వెళ్ళిపోయారు. నేనాడపిల్లనని నన్ను వదిలేశారు. ఉద్యోగం పేరు చెప్పి బాగా నే నిలచేశాను. కానీ నాకు నా అన్నవాళ్ళు లేరు. ఓ చెల్లుంది. కానీ తనకంటూ ఓ ఆధారం ఏర్పడ్డానికే అది నాతో కలిసి వుంది. తల్చుకుంటే నాకు చాలా బాధగా వుంటుంది" అంది చంచల.

కృష్ణమోహన్ నిట్టూర్చి—"నీ కథలో నాకు విషాదం కనబడలేదు...." అన్నాడు.

"నేను ఒంటరి ఆడదాన్ని. స్వంతిల్లుంది. ఎంతో కొంత డబ్బుంది. నాకు అందం, ఆకర్షణ వున్నాయని—చాలామంది అంటారు. నా చుట్టూ యెందరో మగాళ్ళు వలలు పన్నుతున్నారు. సాధారణంగా నా యీడు పిల్లలకి రక్షించే పెద్దలుంటారు. నన్ను నేనే కాపాడుకోవాలి. కాపాడుకోగలనో లేదో తెలియదు. ఏ క్షణంలో యే వలలో పడిపోతానోనని నాకు భయంగానూ, బెంగగానూ వుంటోంది——...." అంది చంచల.

"నీ బాధ నా కర్థమయిందిప్పుడు. వలకు సంబంధించినంతవరకూ నీకూ నాకూ కొంత పోలిక వుంది. ఎటొచ్చీ వల గురించి భయపడుతున్నావు. నే నెదురుచూస్తున్నాను...." అన్నాడు కృష్ణమోహన్.

"అంటే?" అంది చంచల ఆశ్చర్యంగా.

"నేను మగాణ్ని. ధనవంతుణ్ని. ఒంటరిని. నాతో ఆడతోడవసర మనిపిస్తోంది. నాకై నేనే ప్రయత్నిస్తే యెందరో నాకు వశమవుతారు. నా కిష్టంలేదు. ఎందుకంటే నేను స్త్రీని తాత్కాలికావసరంగానే తప్ప బాధ్యతగా స్వీకరించదల్చుకోలేదు. నా సంస్కారం నన్ను స్త్రీని మోసగించడానికి ఒప్పుకోదు. అందుకే నాపై వల విసిరే స్త్రీ కోసం నేనెదురు చూస్తున్నాను. అప్పుడామె మోసపోయినా అది స్వయంకృతాపరాధమవుతుంది తప్ప—తప్పు నాదికాదు—" అన్నాడు కృష్ణమోహన్.

చంచల మరింత ఆశ్చర్యంగా—"నీ మాటలు నేను నమ్మలేను—" అంది.

"నమ్మడం నమ్మకపోవడం నీ ఇష్టం. నిజం చెప్పడం నా బాధ్యత...."

చంచల కతడు తన్ను హెచ్చరిస్తున్నాడని అర్థమయింది.

"నువ్వు నన్ను తప్పుగా అర్థం చేసుకున్నావు.... నేను కోరుతున్నది నీ స్నేహాన్ని. నేను నీపై వలను విసరాలనుకోవడం లేదు...."

"భుజాలు తడుముకోకు. నా అభిప్రాయంలో స్త్రీ పురుషుల మధ్య కేవలం స్నేహం సాధ్యపడదు. ఇలా పార్కులో మాట్లాడుకోవడం వేరు. మనమే గదిలోనో ఏకాంతంగా కలుసుకుంటే—స్నేహం ప్రణయంగా మారడానికెంతో సేపు పట్టదు. అది సృష్టి విశేషం...."

"నువ్వు చాలా ఫ్రాంక్‌గా మాట్లాడుతున్నావు...."

అంది చంచల.

"నా తీరే అంత! నా పేరున పెద్ద వ్యాపారమే నడుస్తోంది. కానీ నేను అనామకుణ్ని. నా పనుల్లో నేను కనపడను. మీటింగులకి నేను వెళ్ళను. ఊళ్ళో చాలా మందికి నేను తెలియను. వ్యక్తిగత జీవితమంటే నాకెంతో యిష్టం. ఒకరి ప్రమేయం లేకుండా, డబ్బుకిబ్బంది లేకుండా అలా బ్రతికే అవకాశం నాకొచ్చింది. నా వ్యవహారం చూసే మనుషుల్ని నేను పూర్తిగా నమ్ముతున్నాను. ఏ విషయంలోనూ వారిని ప్రశ్నించకుండా వారికి పూర్తి స్వాతంత్ర్యమిచ్చాను. అందుకు వారు నా పట్ల కృతజ్ఞులు. వారిపై నే నథార్టీ చేయను. వారు నేనంటే భయంగా వుంటారు. నా సిరిసంపదలు, వైభోగం- వారి కారణంగా నే నని నాకు తెలుసు. ఆ విషయం నేను వారికి చెబుతాను. ఏ రోజైనా వారు నన్ను మోసం చేస్తే బాధపడను. నాకున్నది నాకు చాలు...."

"చాలా విచిత్రమైన మనిషివి నీవు...." అంది చంచల.

"పిలవకుండా నాతో వచ్చి మాట్లాడిన అందమైన యువతికి నా గురించి ఈ మాత్రం చెప్పాలనుకున్నాను" అన్నాడు కృష్ణమోహన్.

"నీ గురించి చాలా చెప్పావు. థాంక్స్. కానీ నువ్వు పెళ్ళెందుకు చేసుకోవు?"

"ముందే చెప్పాను నీకు. నేను వ్యక్తిగత జీవితాన్ని చాలా యెక్కువగా ప్రేమిస్తాను. వివాహం చేసుకుంటే భార్య ఆ వ్యక్తిగత జీవితంలో ఒక భాగమవుతుంది. అందుకు నాకభ్యంతరం లేదు. కానీ అప్పుడామె

పూర్తిగా నాకే చెందాలి. నన్ను ప్రేమించాలి. నా గురించే ఆలోచించాలి. నా శరీరంలో భాగమై పోవాలి...."

"నీ భార్య కూడా నీ గురించలాగే అనుకుంటే...."

"అనుకోవాలనే నా కోరిక.... నేను నా భార్య కివ్వ గలిగినదే నేనామె నుంచి కోరుకుంటాను...." అన్నాడు కృష్ణమోహన్.

"యూ ఆర్ గ్రేట్...." అంది చంచల.

"థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్! కానీ నా అభిమతాన్ని ఏ భార్యా మెచ్చుకుంటుందనుకోను...."

"ఎందుకని?"

"ఆడవాళ్ల మనస్తత్వం వేరు. వాళ్ళు స్వార్థపరులు. నలుగురిలో తమకో ఉన్నత స్థానం కావాలని—వారెన్ని త్యాగాలైనా చేస్తారు. భర్తను కాక అతడి హోదానూ, తద్వారా తమకు వచ్చే హోదాను ప్రేమిస్తారు. భర్త యెంతగా అభినందించినా, సంతోషించినా వారికి తృప్తి ఉండదు. తమ సౌందర్యానికి, ఉనికికి లోకంలో గుర్తింపు లభించాలి. ఆ గుర్తింపు కోసమే వారి తాపత్రయం. ఫలానా ఆమె చీర బాగా కడుతుంది, చక్కగా అలంకరించుకుంటుంది, తీయగా మాట్లాడుతుంది, అద్భుతంగా వంటలు చేస్తుంది—అని లోకం మెచ్చుకోవాలి. అందుకే వారు తాపత్రయపడతారు. నా కది నచ్చదు...."

"అయితే?"

"నా కితరులతో పనిలేదు. నా భార్యకోసం జీవిస్తాను. నా భార్య కూడా అలాగే నా కోసం జీవించాలనుకుంటాను...."

"నీవు, స్త్రీల గురించి యెవరో తప్పుగా చెప్పారు. సాధారణంగా యే స్త్రీ అయినా భర్త కోసమే జీవించాలనుకుంటుంది. పురుషుడు భార్యకంటే ఎక్కువగా బయటి ప్రపంచాన్ని ప్రేమిస్తాడు....భర్త నీవలా వుంటే ఏ భార్యయినా యెంతో సంతోషిస్తుంది...." అంది.

కృష్ణమోహన్ నవ్వాడు. తను వివాహమయిందని చెప్పలేదు.

"అవకాశం లభిస్తే నేను నీ దురభిప్రాయాలను తొలగించగలను—" అంది చంచల మళ్ళీ.

"నీకా అవకాశం రాదు. నేను వివాహం చేసుకోనని ప్రతిజ్ఞ పట్టాను...." అన్నాడు కృష్ణమోహన్.

"జీవితాంతం పెళ్ళి చేసుకోకుండా వుండిపోతావా?" అంది చంచల. ఆశ్చర్యం ఆమె కళ్ళలో స్పష్టంగా కనబడుతోంది.

"అవును—....తప్పనిసరి పరిస్థితులెదురైతే తప్ప...."

"తప్పనిసరి పరిస్థితులంటే....?"

"పెళ్ళి చేసుకోనంత మాత్రాన స్త్రీ ఆకర్షణనుంచి నేను తప్పించుకోగలననుకోను. అలాంటప్పుడే స్త్రీ అయినా నా కారణంగా తల్లి అయితే—ఆమెపట్ల నాకు కొంత బాధ్యత వుంటుంది. ఆ బాధ్యతను డబ్బుతో తీర్చుకోగలిగితే ఫరవాలేదు. కానీ ఒకోసారి తప్పనిసరి పరిస్థితి ఏర్పడవచ్చు...."

చంచల కతడి ఉద్దేశ్యం అర్థమయింది. అతడు తనను ప్రోత్సహిస్తున్నాడు. అదృష్టాన్ని పరీక్షించుకోమంటున్నాడు. ప్రతిఫలంగా డబ్బివ్వగలనని సూచిస్తున్నాడు. తప్పనిసరయితే వివాహం చేసుకోగలనని ఆశపెడు

తున్నాడు.

"నీపై నా గౌరవం పెరిగింది. మనిద్దరివీ ఒకేరకం భావాలు. మనం కేవలం స్నేహంగా వుందాం—...." అంది చంచల.

## 5

మొదట్లో కొన్ని రోజులు చంచల, కృష్ణమోహన్ పార్కులో కలుసుకునేవారు. తర్వాత ఆమె అతణ్ని తనింటి కాహ్వానించింది.

ఇద్దరూ చనువుగా ఎన్నో మాట్లాడుకునేవారు. కానీ దూరం మెయింటైన్ చేసేవారు.

ఒకరోజున కృష్ణమోహన్ పార్కులో ఆమెతో—
"మన స్నేహం అపూర్వమైనది. ఇంతకాలం స్నేహంలో కూడా మనమింకా దూరంగా ఉండగలుతున్నామంటే- మనకు పరస్పరం మంచి స్నేహభావం, గౌరవమున్నాయనుకోవాలి. లేదా మనమిద్దరం మహోన్నతులమై ఉండాలి. లేదా — మనకు పరస్పరాకర్షణ లేదనుకోవాలి—...." అన్నాడు.

"మూడోది నిజం కాదు—" అంది చంచల.

"ఎలా చెప్పగలవు?".

"చాలా సింపుల్. మనమిద్దరం ఒకరిపై ఒకరు వల విసురుకుందుకు ప్రయత్నించడం లేదు...."

"అదే—ఎలా చెప్పగలవు?"

"ఆడది తల్చుకుంటే మగాణ్ని అతిసులభంగా వశపర్చుకోగలదు. మగాడు ప్రయత్నిస్తే ఆడదాన్ని సులభంగానే తన దారికి మళ్ళించుకోగలడు. నువ్వూ నేనూ పరస్పర స్నేహాన్ని మాత్రమే అభిలషిస్తున్నాం...."

"నీ మాటలు నిజంకాదు....తల్చుకున్నా నీవు నన్ను

గళపర్చలేవు...."
"శావాలంటే ఋజువు చేయగలను...."
"ఇది నా వ్యక్తిత్వానికే సవాల్ .."
"ఈ సవాలులో నేనోడితే నీ వ్యక్తిత్వం నిలబడవచ్చు. కానీ నీ వోడినా గెలుపు నీదే—అప్పుడు నా జీవితం సంగతేమిటి?"
"నా కారణంగా ఎవరి జీవితమూ నాశనం కాదు.." అన్నాడు కృష్ణమోహన్.
చంచల నవ్వి—"నేను నిన్ను నమ్ముతున్నాను—" అంది. ఆ నవ్వు యెప్పటిలాకాక కొత్త రకంగా మనోహరంగా వుంది.
అప్పుడే యిద్దరూ పార్కులోంచి లేచారు.
చంచల అతణ్ని తనింటికి డిన్నరు కాహ్వానించింది.
ఇంట్లో సుభద్ర లేదు. ఆమె సెలవు పెట్టి తలిదండ్రుల వద్దకు వెళ్ళింది.
ఇంట్లో సదుపాయాలు బాగున్నాయి.
ముందు చంచల వంట చేసింది. ఆ సమయంలో కృష్ణమోహన్ పేపరు చదువుతున్నాడు.
వంటయ్యాక ఆమె కృష్ణమోహన్‌ని స్నానం చేసి రమ్మంది. అతడి కోసం రాత్రి బట్టలు కూడా సిద్ధంగా ఉంచింది.
"ఇవెక్కడివి?" అన్నాడాశ్చర్యంగా.
"మా నాన్న, అన్న....ఇక్కడికి వచ్చినపుడు కట్టుకుంటారు...."
కృష్ణమోహన్ స్నానం చేసి వచ్చాడు.
తర్వాత చంచల తనూ స్నానం చేసి వచ్చింది.
ఇద్దరూ భోంచేశారు.

"ఎంత అద్భుతం—...." అన్నాడు కృష్ణమోహన్.

"అది అభిమానం...." అంది చంచల.

"ఇక నేను సెలవు తీసుకుంటాను...." అన్నాడు కృష్ణమోహన్.

"అప్పుడేనా" అంటూ అదోరకంగా పళ్ళు విరుచుకుంది చంచల.

ఆ విరుపులో ఆమె యొక్క పెట్టిన మన్మథబాణంలా మారింది.

కృష్ణమోహన్ చూపులామె శరీరంలో చిక్కబడిపోయాయి.

అతడక్కడే ఆగిపోయాడు.

చంచల నవ్వింది.

ఆ నవ్వులో పిలుపుంది. మత్తుంది.

కృష్ణమోహన్ ఆమెవైపుగా నడిచాడు.

చంచల శరీరంనుండి మైమరపించే పరిమళం....

కృష్ణమోహన్ ఆమెకు దగ్గరయ్యాడు.

# 6

"నువ్వే గెలిచావు—" అన్నాడు కృష్ణమోహన్.

"కానీ నేనోడిపోయాను—" అంది చంచల.

"అదెలా సాధ్యం?"

"నిన్ను రెచ్చగొట్టాలనుకున్నాను. కానీ నీకు లొంగిపోవాలనుకోలేదు. నీ గొప్పతనం నన్ను నీకు దాసోహమనిపించింది. నీ వ్యక్తిత్వం నన్ను నేను మరిచిపోయేలా చేసింది...." అంది చంచల.

కృష్ణమోహన్ కళ్ళు మూసుకున్నాడు. అతడి మనసు తీవ్రాలోచనలో వుంది. అతడి ముఖంలో సంతోషం ప్రతిఫలించడంలేదు.

ఆ తర్వాత ఇద్దరూ ఎన్నోసార్లు కలుసుకున్నారు. సన్నిహితంగా మసిలారు.

ఒకరోజున చంచల అతడితో — "మన వివాహ మెప్పుడు?" అంది.

"వివాహమా? అలాగని నీకు వాగ్దానం చేశానా?" అన్నాడు కృష్ణమోహన్ తాపీగా.

"లేదు. కానీ...." అని ఆగింది చంచల.

"ఊఁ.... కానీ...."

"నేనిప్పుడు తల్లిని కాబోతున్నాను...."

పక్కలో బాంబుపడ్డట్టు ఉలిక్కిపడ్డాడు కృష్ణమోహన్.

"అదేమిటలా ఉలిక్కిపడ్డావు?" అంది చంచల.

"నువ్వు చెప్పింది—అసాధ్యం...."

"ఎందుకని?'

కృష్ణమోహన్ తన చొక్కా జేబులోంచి ఓ టాబ్లెట్ తీసి చంచలకు చూపిస్తూ—"ఇది కుటుంబ నియంత్రణకు మగవారి టాబ్లెట్. నూటికి నూరుపాళ్ళు సక్సెస్ గ్యారంటీ—" అన్నాడు.

"అయితే?"

"నేనిది వాడుతున్నాను...."

చంచల అదోలా అతడి కంక చూసి—"అయితే డాక్టరబద్ధం చెప్పాడంటావా?" అంది.

"అయుండవచ్చు...."

"అబద్ధం చెప్పాల్సిన అవసర మేముందా డాక్టరుకి."

"ఎందుకైనా మంచిది—మరో డాక్టర్ని చూడు."

"కొన్ని విశేషాలు డాక్టరు చెప్పకుండానే ఆడవాళ్ళకు తెలుస్తాయి...."

కృష్ణమోహన్ చటుక్కున—నిజం "చెప్పావు—" అన్నాడు.

చంచల ఉలిక్కిపడి—"అంటే?" అంది.

"బిడ్డకు తండ్రి ఎవరో తల్లికే తెలుస్తుంది. డాక్టరుకీ కాదు. మగాడికీ కాదు. ప్రియుడికీ కాదు...." అన్నాడు కృష్ణమోహన్ గంభీరంగా.

"ఏమన్నావ్?" అంది చంచల.

"మిస్ చంచలా! నేను తెలివి తక్కువవాణ్ణి కాదు. మన స్నేహం మనని దగ్గర చేసింది. నా నిగ్రహాన్ని ఓడించింది. అంతటితో తృప్తిపొంది ఊరుకోవాలి నువ్వు. అత్యాశకు పోకు...." అన్నాడు కృష్ణమోహన్.

"వాది ఆశ కాదు. అనుబంధం...."

"అనుబంధంలో మోసాలుండవు...."

"నిజం చెప్పావు...." అంది చంచల.

"అంటే?" అన్నాడు కృష్ణమోహన్. కానీ ఆమె చెప్పబోయేది అతడికి తెలుసు.

"నీవు వ్యాపారస్థుడివి. అనుబంధాలను మోసానికుపయోగించడం నీ వృత్తి. నేను నీ వ్యక్తిత్వాన్ని నమ్మాను. నా నమ్మకాన్ని మోసం చేయకు...." అంది చంచల.

"డాక్టరు చేత మరోసారి పరీక్ష చేయించుకో. నీవు గర్భవతివి కావని తెలుస్తుంది. అవునని తేలిందనుకో—అప్పుడు నాకు నీ ప్రియుడెవరో చెప్పు. మీ యిద్దరికీ నేనే దగ్గరుండి పెళ్ళిచేయిస్తాను...." అన్నాడు కృష్ణమోహన్.

"ఆ టాబ్లెట్లోసారి యివ్వు—" అంది చంచల.

"ఎందుకు?"

"చెబుతాను, ముందిలాగివ్వు...."

అతడా టాబ్లెట్టామెకిచ్చాడు.

చంచల దాన్ని పరీక్షించి చూసింది.

పసుపుపచ్చ రంగులో గుండ్రంగా వుందా టాబ్లెట్. దానిపై యే పేరూ లేదు.

"ఏం తెలిసింది నీకు?" అన్నాడు కృష్ణమోహన్.

"మోసపోయానని...." అంది చంచల.

"నీవు మోసపోయుండవచ్చు. కానీ నిన్నెవ్వరూ మోసగించారనుకోను...."

"ఈ టాబ్లెట్ నువ్వు రోజూ వేసుకుంటావా?"

"అవును. ఏ స్త్రీకీ నా కారణంగా మాతృత్వ బాధ్యత రాకూడదని నా అభిమతం...."

"నా ప్రియుడుకూడా అదే పని చేస్తున్నాడు. అతడూ రోజూ ఈ టాబ్లెట్ వేసుకుంటాడని నాకు తెలుసు...." అంది చంచల.

కృష్ణమోహన్ ఆమె వంక అదోలా చూసి— "మొత్తంమీద నీకు వేరే ప్రియుడున్నాడని ఒప్పుకున్నావు. సంతోషం—" అన్నాడు.

"నాకూ సంతోషంగానే వుంది. నీ టాబ్లెట్ పని చేయకపోయే అవకాశముందని నువ్వూ ఒప్పుకున్నావు.." అంది చంచల.

"నేనొప్పుకోలేదు—" అందామనుకుని ఆగిపోయాడు కృష్ణమోహన్. చంచల చాలా తెలివిగా మాట్లాడుతోందని అతడికర్థమయింది.

"ఒప్పుకున్నావు కాబట్టి—నాకు వేరే ప్రియుడు లేడు. నువ్వే నా ప్రియుడివి. కాబోయే భర్తవు...." అంది చంచల.

"పగటి కలలు కనవద్దు—" అంటూ లేచాడు కృష్ణ

మోహన్.

"సరే—రేపు నువ్వు నా యింటికి రావద్దు. మనం పార్కులో కలుసుకుందాం—" అంది చంచల.

# 7

చంచల పార్కుకి వెళ్ళే సమయానికి కృష్ణమోహన్ అక్కడ ఆమెకోసం యెదురుచూస్తున్నాడు. ఆమె చాలా సంతోషంగా—"నువ్వు రావనుకున్నాను—" అంది.

"నీ ఆకర్షణ నీ ఆరోపణలకంటె గొప్పది—" అన్నాడతడు.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్.... నేనిప్పుడు మరో ఆరోపణ చేయడానికి ధైర్యాన్నిచ్చావు...." అంది చంచల.

"ఏమిటది?" అన్నాడు కృష్ణమూర్తి కుతూహలంగా.

"నీవిచ్చిన టాబ్లెట్ డాక్టరుకిచ్చాను...."

"ఎందుకు?"

"కుటుంబనియంత్రణకు మాత్రలు మగవారు వాడేవి మనదేశంలో లేవని డాక్టరు కచ్చితంగా చెప్పాడు. ఆయనకు నీ టాబ్లెట్ చూపించాను. దాన్ని పరీక్షించి—అది విటమిన్ సీ టాబ్లెట్టని తేల్చాడాయన...."

"ఇంపాసిబుల్...."

"నీకా టాబ్లెట్లెవరిచ్చారో చెప్పు. కేసు ఫైలు చేద్దాం."

"అవసరంలేదు. నాకా టాబ్లెట్లమీద నమ్మకం వుంది. నీ డాక్టరుమీద నమ్మకం లేదు." అన్నాడతడు.

"మిస్టర్ కృష్ణమోహన్....నువ్వు నన్ను మోసం చేయాలనుకుంటున్నావు. ఆ విషయం సూటిగా అంగీకరించు. నిన్ను వదిలి వెళ్ళిపోతాను. నాతో యిలా

డొంకతిరుగుడుగా మాట్లాడాల్సిన అవసరంలేదు. నేనందరి లాంటి ఆడదాన్ని కాదు—" అంది చంచల.

"లోపం నాది కాదు. నీది. నేనూ అందరిలాంటి మగాణ్ని కాదు." అన్నాడు కృష్ణమోహన్.

ఇద్దరూ కాసేపొకరినొకరు చూసుకున్నారు. ఆ చూపుల్లో ఒకరి బలాన్నొకరంచనా వేసుకున్నట్లు కనబడుతోంది.

"నీ టాబ్లెట్ పని చేయడంలేదని నా నమ్మకం. నువ్వు నా డాక్టర్ని నమ్మి పరీక్ష చేయించుకోవాలి...." అంది చంచల.

"పరీక్షకు నేను సిద్ధమే!" అన్నాడు కృష్ణమోహన్.

మర్నాడే చంచల కృష్ణమోహన్ని డాక్టర్ రెడ్డికి పరిచయం చేసింది. డాక్టరతడికి జరపాల్సిన పరీక్షలు జరిపి—"నీ శరీరం అన్నివిధాలా ఆరోగ్యంగా వుంది. నిన్ను వివాహం చేసుకున్న యువతి సంతానవతి కాకపోతే ఆ లోపం ఆ యువతిదే కానీ నీది కాకూడదు—" అన్నాడు.

కృష్ణమోహన్ మాట్లాడకుండా బైటకు వచ్చేశాడు. టాబ్లెట్స్ గురించి అతడు డాక్టరుతో మాట్లాడలేదు. ఎందుకంటే ఆ విషయంలో తను చెప్పిందబద్ధమని అతడికి తెలుసు.

చంచల మళ్ళీ అతణ్ని పార్కులో కలుసుకుందా సాయంత్రం. అతడామెను చూస్తూనే—"నీ డాక్టర్ రెడ్డి గురించి చాలా చెడ్డగా విన్నాను—" అన్నాడు.

"ఏమని?"

"డబ్బు కక్కుర్తి వున్నవాడని...."

"అయితే నువ్వే పరీక్షించలేకపోయావా?"

"ఎలా?"

"నా కంటే నువ్వు బాగా డబ్బిచ్చి చూసి కక్కుర్తి పడతాడో లేదో చూడాల్సింది — ...." అంది చంచల.

అతడు మాట్లాడలేదు.

"డాక్టర్ రెడ్డికి డబ్బు కక్కుర్తి వుందని నీ కెవరు చెప్పారో చెప్పు, అతడి ఎదుటే నిలదీసి అడుగుతాను" అంది చంచల.

"ఒక విషయం చెప్పనా?"

"ఊఁ!"

"నీవు నిజంగా గర్భవతివి కావు?...."

చంచల తెల్లబోయి—"ఎవరు చెప్పారు నీకు?" అంది.

"డాక్టర్ రెడ్డి నా విషయంలో తప్పినపుడు నీ విషయంలో తప్పడా?" అన్నాడు కృష్ణమోహన్ నవ్వుతూ.

"నీ విషయంలో తప్పాడని ఋజువేమిటి?" అంది చంచల.

"చాలా పెద్ద ఋజువుంది— ...." అన్నాడు కృష్ణ మోహన్.

"ఏమిటది?"

అతడు జేబులోంచి ఓ కాగితం తీసి చంచల చేతిలో పెట్టాడు.

చంచల ఆ కాగితాన్ని పరిశీలించి చూసింది.

అదో ఫోటో కాపీ!

డాక్టర్ సుదర్శన్ కృష్ణమోహన్‌ని పరీక్షించిచ్చిన

రిపోర్టది. రిపోర్టు ప్రకారం కృష్ణమోహన్‌కి సంతాన యోగ్యత లేదు.

"రిపోర్టుమీద తేదీ చూడు...." అన్నాడు కృష్ణమోహన్.

సుమారు మూడేళ్ళ క్రితం రిపోర్టది.

"తేదీ ప్రసక్తి ఎందుకిప్పుడు?"

"ఈ రిపోర్టు కారణంగానే నేను పెళ్ళికి విముఖుడి నయ్యాను. మూడు సంవత్సరాలుగా విచ్చలవిడిగా తిరుగుతున్నాను. సంతానార్హత లేనప్పుడు వివాహం చేసుకోవడమెందుకు? భార్య అనే గుదిబండను మెడకు తగిలించుకోవడమెందుకు?" అగాడతడు.

"భార్య గుదిబండ కాదు. జీవితానికో తోడు. అద్భుతమైన తోడు. ప్రియురాలికీ భార్యకూ తేడా వుంటుంది. ఆ తేడా వివాహమైతే గానీ తెలియదు...."

"మిస్ చంచలా! స్త్రీపురుషుల వివాహబంధాన్ని పటిష్ఠం చేసేది సంతానం. ఆ సంతానం లేకపోతే— వారిద్దరూ ఎవరికివారే అన్నట్లుంటారు...."

"ఎవరి అభిప్రాయం వారిది!" అంది చంచల.

"బాగా చెప్పావు. మూడేళ్ళుగా విచ్చలవిడిగా తిరుగుతున్నాను. ఈరోజు నువ్వబద్ధం చెప్పేదాకా— డాక్టర్ సుదర్శన్ రిపోర్టబద్ధం కాలేదు...."

చంచల తన వానిటీ బ్యాగ్‌లోంచి ఓ కాగితం తీసి దానిపై బాల్ పెన్నుతో—నోట్ చేసుకుంది డాక్టర్ సుదర్శన్ అడ్రసు.

"ఏం చేస్తున్నావు....?" అన్నాడు కృష్ణమోహన్.

"నువ్వు చాలా తెలివైనవాడివి. నన్ను మోసం చేయాలని డాక్టర్ సుదర్శన్ రిపోర్టును సృష్టించావు. డాక్టర్

రెడ్డి సామాన్యుడు కాడు. డాక్టర్ సుదర్శన్ అనేవా డంటూ వుంటే—అతడి మోసాన్ని బయట పెడతాను"
అంది చంచల.

కృష్ణమోహన్ నవ్వి ఊరుకున్నాడు.

# 8

నర్సింగ్ హోంలో—ఓ గదిలో—

డాక్టర్ రెడ్డి—ఆయనెదుట చంచల—యిద్దరే కూర్చున్నారు.

"డాక్టర్—మీరు నన్ను మోసం చేశారు...." అంది చంచల.

"ఎలా?"

"నా గర్భం అబద్ధమని కృష్ణమోహన్ కు చెప్పే శారు...."

రెడ్డి నవ్వి—"ఎవరన్నారు?" అన్నాడు.

"కృష్ణమోహన్ ...."

"అయితే నీకతడు అబద్ధం చెప్పాడు...."

"అసలు మీ రిపోర్టే అబద్ధమని అతడంటున్నాడు. అందువల్ల నా గురించి మీరు చెప్పింది కూడా అతడు నమ్మడంలేదు...."

విషయం అర్థం చేసుకుందుకు రెడ్డికి కాస్సేపు పట్టింది. అప్పుడాయన-"మిస్ చంచలా! నీమీద నాకున్న ప్రత్యేకాభిమానంతో—నేను నీ పెళ్ళికి సహకరించాలనుకున్నాను. లేని గర్భాన్ని కల్పించి చెప్పాను. కానీ అతడి విషయంలో నే నిచ్చిన రిపోర్టు మాత్రం తప్పు కాదు...." అన్నాడు.

"మీపై నాకా నమ్మకముంది. కానీ ఈ రిపోర్టు సంగతేమిటి?"

డాక్టర్ రెడ్డి మిస్ చంచల అందించిన రిపోర్టందుకుని చూసి—"ఇది మూడేళ్ళ క్రితం రిపోర్టు—" అన్నాడు.

"రిపోర్టు ప్రకారం వైద్య ప్రయత్నాలవల్ల కృష్ణమోహన్ కి సంతాన యోగ్యత పుట్టదు, కాబట్టి మూడేళ్ళలో అతడిలో మార్పు వచ్చిందనుకోవడానికి లేదు...."

డాక్టర్ రెడ్డి ఆలోచనగా—"ఈ రిపోర్టు గురించి ఆరాతీసి మెడికల్ ప్రొఫెషన్లో నా నిజాయితీని నిలబెట్టుకుంటాను—" అన్నాడు.

"మీరు నిజాయితీ గురించి కాక నా గురించి ఆలోచించండి—" అంది చంచల భయంగా. ఆయన తన గురించిన నిజం కూడా కృష్ణమోహన్ కి చెప్పేస్తాడేమోనని ఆమె భయం.

"నీ భయం నా కర్థమయింది. ఒకరికి మంచి చేయడం కంటె నిజాయితీ నాకు ముఖ్యం కాదు—" అన్నాడు డాక్టర్ రెడ్డి.

## 9

పార్కులో ఓ సాయంత్రం—

చంచల, కృష్ణమోహన్—ఒకరికొకరు—ఎదురెదురుగా....

"ఇక నేను నీ యింటికే వస్తాను. నీవు నా యింటికి రానక్కర్లేదు—...." అంది చంచల ఉత్సాహంగా.

"చాలా ఉత్సాహంగా కనబడుతున్నావు...." అన్నాడు కృష్ణమోహన్.

అతడికి తెలుసు—ఆమె తనపై వల విసురుతున్నదని! తానా వలలోంచి తప్పించుకోగలడనీ తెలుసు....అతడి

నమ్మకం అతడిది.

"డాక్టర్ రెడ్డి సామాన్యుడు కాడు—...." అంది చంచల.

"ఊఁ!"

"ఆయన సుదర్శనాన్ని కలుసుకుని నిజం కక్కిం చారు...."

"ఏమిటా నిజం?"

"ఒకసారి నువ్వు చిన్న యాక్సిడెంట్‌లో ప్రమాదా నికి గురై—ఓ నర్సింగ్ హోంలో చేరావు. అప్పుడు నీకు సుదర్శన్ వైద్యం చేశాడు...."

"అవును...."

"నువ్వో అమ్మాయిని ప్రేమించావు....అవునా?"

"నేను నిన్ను ప్రేమించలేదు...."

చంచల తడబడకుండా— "నా సంగతి కాదు. నీవు ప్రమాదానికి గురైనప్పుడు నువ్వో అమ్మాయిని ప్రేమించి ఉన్నావు.... అవునా?"

"అవునేమో—వినడానికి కుతూహలంగా ఉంది— చెప్పు...."

"ఆమెను మరో యువకుడు ప్రేమించాడు—...."

"ఊఁ!"

"అతడు డాక్టర్ సుదర్శన్‌కి స్నేహితుడు—...."

"అయితే?"

"నీకు డబ్బుంది. అతడికి లేదు. అందుకని ఆ అమ్మాయి నిన్నే ప్రేమిస్తోంది. నిన్ను వివాహానికి విము ఖుణ్ని చేయాలని ఆ యువకుడు డాక్టర్ సుదర్శన్‌కి డబ్బిచ్చాడు. ఫలితమే ఈ రిపోర్టు...."

కృష్ణమోహన్ ఆశ్చర్యంగా—"నువ్వు నిజమే చెబు

తున్నావా?" అన్నాడు.

"నీ విషయంలో—అడిగినా నా నోటి వెంట అబద్ధం రాదు...."

చంచల, అతడు మళ్ళీ ఒకరినొకరు చూసుకున్నారు.

ఇద్దరూ ఒకరికొకరు సమ ఉజ్జీలు ...

అతడు టాబ్లెట్ వాడుతున్నా నన్నాడు.

ఆమె గర్భవతి నంది.

అతను తనకు సంతానయోగ్యత లేదన్నాడు. ఆమె ఉందంది.

ఆమె ఓ డాక్టరు రిపోర్టు తెచ్చింది. అతడింకొకటి తెచ్చాడు.

ఆ రిపోర్టుకామె ఓ కథ అంటగట్టింది.

"మిస్ చంచలా—మన మిద్దరం సమ ఉజ్జీలం...." అన్నాడతడు.

"ఇన్నాళ్ళకు గ్రహించావు—...." అంది చంచల సంతోషంగా.

"కానీ సమ ఉజ్జీలకు వివాహమైతే కలతలు రేగుతాయి...."

"ఎందుకని?"

"భార్యాభర్త లిద్దరూ సమమైన తెలివి కలిగి ఉండకూడదు. ఒకరికి తెలివివుండాలి. ఒకరు సామాన్యులు కావాలి. అప్పుడే వారు సర్దుకు పోగల్గుతారు...."

"మళ్ళీ కొత్త పాయింటు తేకు. నేను భరించలేను" అంది చంచల.

"నేను చెప్పింది కాదంటావా?"

"కాదనక ఔనంటాననుకున్నావా? ఆడదాని తెలివి

పెళ్ళయ్యేవరకే రాణిస్తుంది. పెళ్ళయ్యాక ఆమె తన భర్త చల్లనినీడలో బ్రతుకుతూ— అతడిని సుఖపెడుతూ— తన తెలివిని మరిచిపోతుంది. అందుకే తెలివైన ఆడవాళ్ల కాపురాలు కూడా వీధికెక్కడంలేదు...."

కృష్ణమోహన్ సాలోచనగా— "ఏ విషయమూ నేను నీకు రేపు చెబుతాను...." అని ఆవెట్టికామెవద్ద సెలవు తీసుకున్నాడు.

## 10

మర్నాడు పార్కులో చంచల యెదురు చూస్తూండగా—

కృష్ణమోహన్‌కి బదులు మరో వ్యక్తి ఆమెను కలుసుకొని—

"నా పేరు సీతాపతి! కృష్ణమోహన్ మీ కిది ఇమ్మన్నారు...." అంటూ ఓ బ్రీఫ్‌కేసు నామె కందించి— వెళ్ళిపోయాడు.

చంచల తెల్లబోయి బ్రీఫ్‌కేసు తెరిచి చూసింది. అందులో నోట్లకట్టలున్నాయి. మొత్తం లక్ష రూపాయలు....

ఆ నోట్లకట్టల అడుగున ఓ కవరు.... కవర్లో ఉత్తరం....

"డియర్ చంచలా!

నీ ఉపకారాన్ని నేను మరచిపోలేను. నేను నీ కిస్తున్న డబ్బులో— నిన్ను విలువకట్టానని పొరబడకు. నీ జీవిత సహచరుణ్ణెన్నుకోవడంలో ఈ డబ్బు నీకు సాయపడాలని నా కోరిక.

డాక్టర్ సుదర్శన్ రిపోర్టును నేను నిజమని నమ్మాను. అయినా నేను ప్రేమించిన యువతికి నిజం చెప్పకుండా ఆమెను పెళ్ళి చేసు

కున్నాను. మా దాంపత్య ఫలించి ఆమె గర్భవతి అయితే ఆమె ననుమానించి విషయం చెప్పకుండా ఆమెను విడిచి వచ్చేశాను.

ఆమెను విడిచి నే నిక్కడ చేసిందేమిటని నీ వనుకోవచ్చు. నేను నా భార్య పట్ల యెలా వుంటానో—అంతకు మించి యేమీ ఆశించను. నే నామె నభిమానిస్తున్నప్పుడు ఆమె నాకు తెలియకుండా వేరెవరితోనో గడిపిందని కూడా నేను బాధపడలేదు. ఆ విషయం రహస్యంగా ఉంచినందుకు బాధపడ్డాను. ఆమె నన్ను మోస గించినట్లు ఫీలయ్యాను. ఆమెను వదలి పెట్టాను.

నాకు వివాహమైందన్న విషయంవిడిచి మిగతా నిజాలన్నీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో నీకు చెప్పనే చెప్పాను. నీలో ఆశలు పెంచానని కూడా నే ననుకోను.

నా తప్పు గ్రహించాను. నాతో డాక్టర్ సుదర్శన్ వున్నాదన్న లోపం గురించి నా భార్యకు చెప్పకపోవడం కూడా నేను చేసిన పెద్ద తప్పుల్లో ఒకటి. నువ్వు నా చేత తప్పు చేయించి నాపై వల విసరాలనుకున్నావు. అది నాకు మరో విధంగా సాయపడి నా కాపురాన్ని నిలబెట్టింది.

ఒక గృహస్థు జీవితంలోకి ప్రవేశించి—అతడి నిబ్బంది పెట్టాలనుకునే సంస్కారం నీకు లేదు. నాకు సముఉజ్జీవైన నీవు — తగిన వరుడి నెన్నుకొని వివాహం చేసుకుని త్వరలో నే జీవితంలో స్థిరపడగలవని నమ్ముతున్నాను. నువ్వాంచే

నాకూ భయం లేదనడానికి సూచనగా నా చిరునామా నీకిక్కడ ఇస్తున్నాను.

నీకు నా ధన్యవాదాలు. కృతజ్ఞతలు.

నీ

కృష్ణమోహన్—"

ఉత్తరం చదివి చంచల భారంగా నిట్టూర్చింది. తన వల విఫలమైనా, కృష్ణమోహన్ తన్ను కాదన్నప్పటికీ- ఆమె కతడిపై కోపం రాలేదు.

"భర్త నెన్నుకు నేందుకు వల విసరకూడదు! మరో పద్ధతి ననుసరించాలి—" అనుకున్నదామె.

—:అయిపోయింది:—

# అదృశ్య శక్తి

కె.బి.యస్. కుమార్

ఛెళ్ళుమన్నది నా చెంప.

నా కళ్ళముందు చుక్కలు నాట్యం చేశాయి. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. బుగ్గలమీదుగా జారాయి. కుడిచేత్తో చెంపని అదిమిపట్టుకుని అర్జున్‌ని చూశాను. ఆ చూపుల్లో నిరసన వుంది.

అర్జున్ కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి.

నా కళ్ళలో రుధిరం పేరుకుపోతోంది. అంచులు దాటిన నీటిమట్టంలా ఒక్కొక్క చుక్క క్రిందికి రాలుతోంది.

నా చూపుల్లో వర్ణించలేని తిరస్కార భావం వుంది. లోకాన్నే శపించగల క్రోధం యిమిడి వుంది. వాటికే శక్తి వుంటే ఈపాటికి అర్జున్ మాడి మసైపోయి వుండేవాడు.

"అయితే నీ నిర్ణయం మారదన్నమాట!!" గద్దించినట్టుగా అన్నాడు అర్జున్.

చటుక్కున ఇవతలికి తిరిగాను. వాడి మొహం చూడ్డం కూడా యిష్టం లేదు నాకు. రోగ్! బ్లడీ బాస్టర్డ్! డర్టీ రాస్కెల్! వాడి అంతం చూడాలి నేను.

"ఒరే పవన్ .... నా మాటలు విన్నా! నీకు పుణ్యముంటుంది! యిది మంచి ఆఫర్! నీకు పదివేలు యిస్తాను. పంతాలకు పోయి పైకాన్ని నష్టపోకు. ఆఖరిసారిగా చెబుతున్నాను. నా పరువు తియ్యకు."

"ఛీ....! పరువు! పరువు నీకెక్కడుందిరా!? ఇప్పుడు సంఘంలో నువ్వనుభవిస్తోన్న, ఈ పరువు ప్రతిష్టలూ అనుభవిస్తోన్న ఈ రాజభోగాలు ఎవరి దయా భిక్షో ఒక్కసారి నీ అంతరాత్మ నడుగు. పవన్ పవన్ పవన్ అని గొంతు చించుకుని అరుస్తుంది. అసలు నీకు అంతరాత్మ అనేదుందా!? నువ్వు మనిషివి కాదురా! రాక్షసుడివి! నువ్వు కళాకారుడివి కావురా! కళాద్రోహివి!"

"షటప్!" గట్టిగా గర్జించాడు అర్జున్. ఆ అరుపులు ఆ గదికి సంబంధించిన నాలుగ్గోడలకూ లోపలివైపున విసురుగా తగిలి—బైటికి పోవటానికి మార్గంలేక—భళ్ళున బద్దలై పోయాయి.

"నీకెలా బుద్ధి చెప్పాలో నాకు తెల్సు...." వెచ్చటి ఆవిరితో కలిసి విడివిడిగా అస్పష్టంగా వచ్చాయా మాటలు వాడి నోటి వెంట. నేలపై గట్టిగా తాటించి విసవిసా వెళ్ళిపోయినట్టు గ్రహించాను. కొద్దిక్షణాలకి కిర్రుమన్న చప్పుడు లీలగా వినిపించింది.

వెనుదిరిగాను. గదినంతా ఒక్కసారి పరిశీలించాను.

దాదాపు నలభై చదరపు మీటర్ల వైశాల్యమున్న గది ఇది. బలమైన సిమెంటు గోడలు, తూర్పు గోడకి గడియారం వ్రేలాడుతోంది. ఏ కంపెనీదో ఏ దేశందో

గాని క్రొత్తగా వుందది. దక్షిణం వైపున ఓ మూలకి ఎటాచ్డ్ బాత్రూమ్ వుంది. నిరంతరం నీరు సమృద్ధిగా వుంటుంది. ఉత్తరం వైపున ఫ్రిజ్ వుంది. పడమర వేపున ఖరీదైన టేబుల్, రివాల్వింగ్ ఛైర్. టేబుల్ పై టేబుల్ ల్యాంప్ తో బాటు నాక్కావలసిన పరికరాలన్నీ వున్నాయి.

గోడలకి అందమైన డిస్టెంపర్లు. నేలమీద ఖరీదైన కార్పెట్.

ఉత్తరం వైపున్న కిటికీలోంచి నాకు ఆహారం సప్లయ్ చెయ్యబడుతుంది. ఫ్రిజ్ లో ఎగ్స్, బాయిల్డు ఎగ్స్, ఆమ్లెట్స్, మిల్కు, జ్యూస్, ఫ్రూట్స్ వంటి పదార్థాలు సమృద్ధిగా వుంటాయి. గదిలో గాలి ధారాళంగా వీస్తూంటుంది. ఫిలిప్స ట్యూబ్ లైట్సు రెండు యిరవై నాలుగ్గంటలూ వెలుగుల్ని పంచుతూ వుంటాయి. అవసరం లేదనుకుంటే జీరో లైటు సౌకర్యం కూడా వుంది. సిగరెట్లు తెస్తాడు నౌఖరు.

చూసేవాళ్ళకిది ఇంద్రభవనంలా కనిపిస్తుంది. టేబుల్ కి కాస్త ఇవతలివైపున మంచం, దానిమీద ఫోమ్ బెడ్, డన్ లప్ పిల్లో, బెడ్ షీటు కంటబడితే యిరవై నాలుగ్గంటలూ నిద్రపోదామనిపిస్తుంది.

కాని నాకు మాత్రం అది నరకం. గదిలోని వస్తువులన్నిట్నీ చిందరవందరగా పారెయ్యాలనీ బద్దలు కొట్టాలనీ పిచ్చి ఆవేశం కలుగుతుంది నాకు.

కొత్త కొత్త రుచుల్ని సంతరించుకుని నాకు అందించబడుతోన్న ఆహారపదార్థాలు నా ప్రాణం పోకుండా నిలబెడుతున్నాయే గాని వాటి ప్రత్యేకతల్ని నా మస్తిష్కం గుర్తించలేకపోతోంది.

కారణం....

నేను బందీని!

ఒక స్వార్థపరుడి ఉక్కు కౌగిట్లో చిక్కుకుని స్వేచ్ఛ కోసం అలమటిస్తోన్న ఖైదీని నేను!

ఎనిమిది గంటలు చూపుతోంది గడియారం. అది పగలో రాత్రో తెలీదు. పదిహేడు అంకె చూపుతుంది గడియారంలోని ఓ భాగం అది తేదీయేగాని - ఏ నెలో తెలీదు.

నన్నీ స్థితికి తెచ్చిందెవరు? వాడే! అర్జున్ గాడు!

కేవలం వాడేనా!?

కాదు. నా తప్పుకూడా కొంత వుంది అందులో.

## 2

వాడి అక్కలు, అన్నలు ఎవరూ లేరుగాని నలుగురు చెల్లెళ్ళున్నారు.

పెద్ద చెల్లెలు పెళ్ళప్పుడు కట్నం అయిదొందలు తక్కువైతే యిచ్చేంతవరకూ తాళికట్టమని పెళ్ళికొడుకు తరపు వాళ్ళు మొండిపట్టు పట్టేసరికి పెళ్ళి సవ్యంగా జరుగుతుందో జరగదో అన్న భయం నాన్న గుండెని ఆపేసింది. పెళ్ళి వాయిదా పడింది.

కన్యాదాన ఫలం సంక్రమిస్తుందని. ఆడపిల్ల తండ్రి చనిపోయినా ఆ పిల్ల పెళ్ళి మూడు మాసాల్లోగా చెయ్యొచ్చునని పురాణాలు శాస్త్రాలు ఘోషిస్తున్నా తొందరేముంది ఒక్క నెలలో చేయాలని ఏమీ లేదు అని వాళ్ళ వారికి తోందర్లోనూ వాళ్ళు ఏదుకున్నారు. కట్నం డబ్బు గోవిందా అయిపోయింది.

రెండో చెల్లెలికి చిన్నతనంలో పోలియో సంక్రమించింది. దానికి జన్మలో మూడు ముళ్ళు పడతాయన్న

నమ్మకం పోయింది.

మూడో చెల్లెలు ఇంటర్వ్యూకి వెళ్ళి వస్తోండగా ట్రెయిన్ ఆలస్యం కావటంతో చీకటిపడింది. రిక్షా మాట్లాడుకొని వస్తోండగా దారిలో రిక్షావాడు, మరి యిద్దరు కల్సి దాన్ని పొదల్లోకి లాక్కుపోయి మానభంగం చేశారు. అది మ్రోడులా ఇంట్లో మిగిలిపోయింది.

పోతే చిన్న చెల్లెలు. దాని పేరు దీప. మా యింటికి నిజంగా దీపమే అది. బియ్యే పాసైంది. ఓ కాన్వెంట్ స్కూల్లో మూడొందలకి టీచర్‌గా పంజేస్తోంది. పెద్దక్కకి కుట్లు నేర్పించి కుట్టుమిషన్ కొనిచ్చింది. ఇదంతా మాని రెండోది యింటిగద్దకి పదిమంది పిల్లల్ని పిలిపించుకుని ట్యూషన్లు చెబుతోంది. మూడో చెల్లెలు ఎప్పుడూ శూన్యంలోకి చూస్తూ గడుపుతూంటుంది.

చూడ్డానికి అమ్మకు శూన్యంకూడా మిగల్లేదు. ఆమె ప్రాణమున్న బొమ్మ. ఆమె కళ్ళు గాజుగోళాలు. మనసు రాతిబండ. అంతే.

ఆవేదన అనే కవ్వంతో మనసు మథించబడినప్పుడు కవిత్వం అనే పదార్థం పుడుతుంది కాబోలు. అది అమృతమో గరళమో నాకు తెలీదు. మనసు బాగా లేనప్పుడు డాబామీద ఒంటరిగా కూచుని బీడీలు తగలేస్తూ యేదేవో గీకేవాణ్ని. అవి ఒకోసారి కవితలయేవి. ఒకోసారి కథలయేవి. పత్రికలకి పంపిస్తే నా వూహాల్ని తలక్రిందులు చేస్తూ అవి అచ్చయ్యాయి.

రచయితగా నాకు ముద్రపడిపోయింది, మా ఇంట్లో.

రచనల నెపంతో మస్తిష్కాన్ని మరో లోకానికి డైవర్టు చేస్తూ తాత్కాలికంగా ఉపశమనం పొందేవాణ్ణి.

ఉద్యోగం ఎటూ రాదు. సిటీలో అయితే నలుగురూ

పరిచయమవుతారు. మామూలుగా రచనలు చేస్తేనే నలభై కాలం అచ్చవుతున్నాయి. సిటీలో నాలుగు పత్రికాఫీసుల్ని దర్శించి నలుగురు ఎడిటర్లని పరిచయం చేసుకుంటే? నన్ను నేను పోషించుకోవచ్చు, ఇంటికీ అంతో యింతో యివ్వొచ్చు.

ఈ ఆలోచన రాగానే అలస్యం చెయ్యలేదు నేను. ఏదో రచన తాలూకు పారితోషికం యాభై రూపాయలు తీసుకొని హైదరాబాదు రైలెక్కేశాను.

ఏన్నో పత్రికాఫీసులు తిరిగాను. మరెందరినో పరిచయం చేసుకున్నాను. అందరూ యెంతో ఆప్యాయంగా మాట్లాడారు.

కొండంత ఉత్సాహంతో వారం రోజులు ఇంట్లోనే కూర్చుని నిర్విరామంగా శ్రమించి పది రచనలు చేశాను. కవర్లకీ స్టాంపులకీ దీపవద్ద పైకం యిప్పించుకుని పోస్టు చేశాను.

అన్ని రచనలూ అచ్చయ్యాయి. అయితే ఒక్కదానికీ పారితోషికం రాలేదు.

నాకో విషయం బోధపడింది, ఈ అనుభవంతో.

తమకై తాము అర్థింపుగా వెడితే సాహితీరంగంలో కూడ చులకన కాక తప్పదు.

ఇంకో విషయంకూడా బాగా గ్రహింపుకి వచ్చింది నాకు.

నేను రచయితగా డబ్బూ కీర్తీ గడించాలంటే రచయితగా నాకు బాగా పేరుండాలి. రచయితగా పేరుండాలంటే బోలెడన్ని రచనలు వెలుగులోకి రావాలి.

బోలెడన్ని రచనలు చెయ్యడానికి సిద్ధమే. కాని

కనీసం పాతికో పరకో పారితోషికంగా ముడితేనే అది సాధ్యమవుతుంది. లేదా నాలోని రచయిత అంతరించి పోయే ప్రమాదం వుంది.

శిశువుకి జన్మనివ్వటానికి స్త్రీ నవమాసాలు మోసి, యెన్నో జాగ్రత్తలు వహించి నొప్పులు తిని—యిన్ని బాధలు పడ్డట్టే రచయితకూడా ఒక రచన వెలువరించాలంటే యెంతో శ్రమ తీసుకోవాలి. ప్లాట్ ఆలోచించుకోవాలి. కథ, కథనం, శైలి, శిల్పం విషయాల్లో యెన్నో మెళకువలు చూపి పాఠకులు లీనమై చదివి ఆ రచయిత రచనలు మరిన్ని రావాలనీ చదవాలనీ కోరుకొనే విధంగా రాయగలగాలి.

ఎంత సమయం వృధా అవుతుంది?

ఎంత ఎనర్జీ నష్టవుతుంది?

ఎంత పేపరు వినియోగించబడుతుంది?

ఎంత కాఫీ (అలవాటుంటే) ఖర్చవుతుంది?

ఎన్ని సిగరెట్లు (డిటో) తగలబడుతాయి?

ఎన్ని స్టాంపులు కావాలి???

ఎంతో కొంత ప్రతిఫలంగా ముడితే ఆ జీవి యెంత సంతోషిస్తుంది? అది ప్రోత్సాహమై—ఆ ప్రోత్సాహం మరింత ఉత్సాహాన్నివ్వగా ప్రతి రచయితా సాహితీ క్షేత్రాన్ని కలమనే హలంతో చక్కగా దున్ని బంగారు పంటలు పండించగలడు.

ఈ పంథాలో ఎందుకాలోచించరు సంపాదకులు?—

• • •

ఎవరిదో చెయ్యి—భుజమ్మీద పడేసరికి ఉలిక్కిపడి తలెత్తాను.

ఎదురుగా అర్జున్!

"ఏమిటి? కెనాల్ గట్టున ఒంటరిగా కూచుని దీర్ఘా లోచనలో పడ్డావు. కొంపదీసి విఫల ప్రేమ కాదు గదా!?"

నవ్వాను. "ఎప్పుడొచ్చావ్?" అడిగాను. కాలువ అవతలి గట్టున వరసగా వున్న పూరిళ్ళని చూస్తూ.

"సిటీనుండి నిన్ననే వచ్చాను. ఇవాళ వెడుతున్నాను. పలకరించి పోదామని మీ యింటికెళ్తే యిక్కడికెళ్ళిం టావని చెల్లెమ్మ చెప్పింది" అన్నాడు అర్జున్.

కాసేపు అవీ యివీ మాట్లాడాక నా గురించి టాపిక్ వచ్చింది. బాధలన్నీ ఏకరువు పెట్టాను.

"నువ్వు కథలు రాస్తున్నావా? నాకు తెలీదే!" అంటూ ఆశ్చర్యపోయాడు.

తడిసి నల్లగామారి కాలువలో కట్టగా కొట్టుకు వస్తోన్న గడ్డిపోచల్ని చూస్తూన్న నేను బదులివ్వలేదు.

"కథలు రాసేవాళ్ళు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తు న్నారు ఈనాడు. పత్రికలుకూడా చాలమటుకు పాఠ కుల్ని ఆకట్టుకుని వాళ్ళని రచయితలుగా మార్చటానికి ప్రయత్నించి సర్క్యులేషను పెంచుకోవాలని చూస్తు న్నాయి. పూర్వం పత్రికలూ రచయితలూ తక్కువ, పాఠకులెక్కువ, యిప్పుడలా కాదు. నువ్వు కథా రచ యితగా రాణించలేవు బ్రదర్ ...."

"మరి!?"

"నవలా రచయితవైపో. సీరియల్ నవల వ్రాయి. ఇది సీరియల్ రచనాయోగం. సీరియల్స్ రైటర్సు ఈనాడు పాఠకుల ఆరాధ్య తారలు!"

పేలవంగా నవ్వాను. "కథలకే పారితోషికాలు రావట్లేదు. ఇక సీరియల్స్! ఎంత కష్టపడాలి?"

"నువ్వు పేరుకోసం రాస్తావా డబ్బుకోసం రాస్తావా?"

"ప్రస్తుతం డబ్బుకోసమే. నా ఆర్థిక పరిస్థితులు నీకు తెల్సు. అది మెరుగుపడాలంటే డబ్బు కావాలి."

"ఇదే మాటపై నిలబడగలవా?"

"ఎందుకూ అలా అడుగుతున్నావ్?"

"నేనడిగిందానికి సమాధానం చెప్పు."

"నిలబడగలను."

"అయితే నువ్వు రేపు నా వెంట సిటీకొస్తున్నావు."

"అదేం?"

"వెళ్ళే దేడా సర్దుకో..." అల్నాడు అర్జున్ లేస్తూ. నాకేమీ అర్థం కాలేదు.

• • •

అర్జున్ నాకొక్కన్ని సూచనలిచ్చాడు.

వాటి ప్రకారం నున్నగా షేవ్ చేసుకున్నాను. చల్లని నీటితో స్నానం చేశాను. వాడి దుస్తుల్లో ఓ జత తీసి వేసుకున్నాను. చక్కగా సరిపోయాయి నాకు.

వయసూ ఒడ్డూపొడుగూ దాదాపు యిద్దరం సమానమే. కాకపోతే వాడు రెండు వేల జీతగాడు కావడంతో కాస్త నున్నగా వున్నాడు.

ఆ సాయంత్రం వాడు నన్ను 'తెలుగుసీమ' వార పత్రిక ఆఫీసుకి తీసుకు పోయాడు. ఎడిటర్ని పరిచయం చేశాడు.

ఎడిటర్తో వాడికున్న చనువు చూసి ఆశ్చర్యపోయాను. వాడు రచయిత కాదు. కాని వాడికో పత్రికా సంపాదకుడు ముఖ్యమైన స్నేహితుడు. నేను రచయితని. అయినా నాకలాంటి స్నేహితుల్లేరు.

ఆ తర్వాత మేం ముగ్గురం ఓ బార్‌కి దారితీశాం. వద్దంటున్నా బలవంతంగా నాచేత 'ఛీర్స్' కొట్టించాడు అర్జున్.

మూడు పెగ్గులకే నేను మైండ్ లెస్ అయిపోయాను. ఆ తర్వాత వాళ్ళేం మాట్లాడుకున్నారో నాకు తెలీదు.

ఇల్లు చేరిన విషయంకూడ గుర్తులేదు నాకు.

మర్నాడుదయమే దాదాపు అరరీము తెల్ల పేపర్లు, కనీసం వందరూపాయలు ఖరీదు చేసే పెన్ను బీరు సీసా సైజులో ఇంక్ తెచ్చి నా ముందర పెట్టాడు అర్జున్.

అయోమయంగా చూశాను.

"క్రయిమ్, రొమాన్స్, సెక్స్, శాడిజమ్, సెంటిమెంట్! ఈ అయిదింటినీ ప్రధానాంశాలుగా తీసుకొని యితివృత్తం రూపొందించుకో. పాఠకుల్ని ఊపిరిబిగబట్టి చదివించేదిగా వుండాలి. నీ రచన చదువుతూ నువ్వే ఉత్కంఠతో బిగుసుకుపోవాలి. నవల కనీసం మూడొందల పేజీలుండాలి. మిగత నిబంధనలు నీకు తెలుసుగా!"

అంతులేని ఆశ్చర్యం నన్నుక్కిరిబిక్కిరి చేసింది.

"అంటే ...అంటే ....?"

"నువ్వు 'తెలుగుసీమ' వారపత్రిక్కి త్వరలో సీరియల్ నవల రాయబోతున్నావు ...."

ఎగిరి గంతేసినంత పని చేశాను.

"మరి అంతగా ఎగరకు. ఆనక కిందపడి ఏ చెయ్యో 'హరీ'మంటే యిబ్బంది పడాల్సొస్తుంది" అన్నాడు నవ్వుతూ.

"సరే. మెల్లిగా ఎగుర్తాను" అన్నాను నేనూ నవ్వుతూ.

"టైటిల్ చెప్పు. పబ్లిసిటీ ఈ వారంనుండే!"

"మృత్యుహేల" అన్నాను యేమాత్రం తడబడకుండా.

• • •

ఉలిక్కిపడ్డాను పత్రిక చూసి.

"ఇదేమిటి?" అన్నాను అర్జున్ని చూసి.

"ప్రకటన" అన్నాడు అర్జున్, నన్నూ పత్రికనూ చూస్తూ.

తెలుగునీను వారపత్రికలో అయిదో పేజీలో ఫుల్ పేజీ అడ్వర్టయిజ్మెంట్ అది. అందంగా నవ్వుతోన్న అర్జున్ పాస్పోర్ట్ సైజు ఫోటో అందంగా ముద్రించబడి వుంది.

"సాహితీ వినీలాకాశంలో మరో క్రొత్త తార! మీ హృదయాల్లో నవసాహితీ ధార!! అందిస్తున్నారు మృత్యుహేల! వివరాలకు తొందరేల??"

ఇదీ ఆ ప్రకటన! దాని చుట్టూ అర్జున్ — అర్జున్ — అర్జున్ — అనే పదాలతో పేజీనిండా ఫ్రేమ్ కట్టబడి వుంది!!

"పవన్!" నా భుజం తడుతూ అన్నాడర్జున్. "నీ అవసరాలకి నా స్వార్థాన్ని కలిపి నీకు రెండింతలు లాభం చేకూర్చబోతున్నాను. అర్థంకాలేదూ! వెల్ — అర్థమయ్యేట్టు చెబుతాను...." చిన్నగా దగ్గి మళ్ళీ మొదలెట్టాడు.

"ఏది లేదో దాన్ని కోరతాడు మనిషి. నీకు ధనకాంక్ష వుంది. నాకు కీర్తి కాంక్ష వుంది. నీకు డబ్బుతో అవసరం వుంది. నాకది పోలెడుంది. నాకు కీర్తి కావాలి. రచయితగా నన్నందరూ గుర్తించాలి. అభిమానించాలి. ఆరాధించాలి. సాటి ఉద్యోగులూ పై అధికారులూ

నన్ను గౌరవించాలి. పాఠకులూ పత్రికలూ నన్ను కీర్తించాలి. ఎక్కడైనా తారసపడినప్పుడు ఆటోగ్రాఫ్ కోసం నా మీదికి ఎగబడాలి. ఆడపిల్లలు నన్ను ఆరాధిస్తూ ఉత్తరాలు రాయాలి. యువతులు నన్ను క్రీగంట గమనిస్తూ నవ్వులు రవ్వల బహూకరించాలి.

"ఇవన్నీ నీకు జరిగినా ఆస్వాదించే పరిస్థితుల్లేవు నీకు. దిగులే ఆస్తిగా పెంచుకుంటోన్న నీ తల్లి, కట్నం కారణంగా పెళ్ళాగిపోయిన పెద్దచెల్లెలు, అవిటితనంతో పెళ్ళి అర్హతని కోల్పోయిన రెండో చెల్లెలు, శూన్యంలో నిధిని చూసుకుంటూ భవిష్యత్తు చూసుకోలేకపోయిన మూడో చెల్లెలు, గుండెలు నొప్పెట్టేలా పిల్లల్తో అరచి అంతంత మాత్రం సంపాదిస్తోన్న చిట్టిచెల్లెలు!!

"వీళ్ళందరి జీవితాలు బాగుచెయ్యాలి ముందు నువ్వు. డబ్బుంటే తల్లిని కూడా కొనుక్కొచ్చే రోజుల్లో. అందుకే—నీ కోరిక, నా కోరిక ఒకే దెబ్బతో తీరేలా ఈ పద్ధతి ఎన్నుకున్నాను.

"చూడు—మృత్యుహేల నవలకి పారితోషికం రెండు వేలు. అందులో ఎడిటర్ కి వేయి కమీషన్ పోయింది. మిగిలింది వేయి. నేనో వేయి కలుపుతున్నాను. ఇదిగో రెండువేలకి చెక్కు...." నా చేతిలో పెట్టాడర్జున్.

రకరకాల ఆలోచనలు నన్ను చుట్టుముట్టాయి. అతి కష్టమ్మీద అదుపులో పెట్టుకున్నాను. ఓరగా అర్జున్ని చూశాను.

" 'చెల్లెలికాపురం' సినిమా చూశావా నువ్వు!?"

మందహాసం చేశాడు అర్జున్. "పవన్ అది సినిమా. ఇది జీవితం. అది రచయిత కలం నుండి వెలువడింది. ఇదలా కాదు. మన స్నేహానికి ముడిపడింది. నీ పేరుని

అక్రమంగా వినియోగించుకోవటం లేదు నేను. నీకు పారితోషికం యిచ్చినా ఎడిటర్ కి జీతం వస్తుంది. కమీషన్ ముట్టింది. కేవలం పేరుకోసం దాదాపు నెల జీతాన్ని నీకు ధారపోశాను, అదీ నువ్వు కాదనవనే నమ్మకంతో ....”

మాట్లాడలేకపోయాను. దాదాపు అరగంట ఘర్షణ తర్వాత నా మనసు చల్లబడటం ప్రారంభించింది.

నిజమే! ఆప్యాయతలు కరువై తండ్రీ కొడుకులమధ్య సైతం వ్యాపారతత్త్వాలు పెరిగిపోతూ కొనసాగుతోన్న ఈ రోజుల్లో ఆ మాత్రం స్వార్థం లేందే ఏ స్నేహితుడు మాత్రం సాయం చేస్తాడు?

చేతిలో చెక్కు ఫ్యాను గాలికి రెప రెప లాడుతోంది.

రెండు వేలు!!

ఎన్ని కథలు వ్రాస్తే వస్తుంది యింత పారితోషికం.

అవును. నాకు డబ్బు కావాలి. నా కుటుంబ సమస్యలు తీరిపోవాలి. అంతవరకూ నా గురించి ఆలోచించే ప్రసక్తే లేదు.

“ఆల్ రైట్ ....ఒక నెలలో నవల పూర్తి చేస్తాను” అన్నాను.

ఆ స్వరంలో అపశ్రుతి నాకు మాత్రమే వినిపించింది.

# 3

చలమయ్య అన్నం కంచం కిటికీలోంచి యివతలికి పెట్టిన చప్పుడు నన్నీ లోకంలో పడేసింది.

ఆకలి బాగా అవుతోంది. మౌనంగా అటుకేసి నడి

అంతా భయంకరమైన అడవి. బాబాకు అన్నివిధాలా అనుకూలమయింది."

"మరయితే అతని స్థావరాన్ని కనుగొనే మార్గమే లేదా?" అవినాష్ కంఠంలో నిరాశ.

"నేను మీకో చిన్న హింట్ యివ్వగలను."

అవినాష్ ఉత్కంఠతో ముందుకు వంగాడు.

"బాబా నివాసం ఏర్పరుచుకొన్న ప్రాంతంలో నీరు లేదు. అందుకే ఆ పదిహేను వందల చదరపు మైళ్ళ ప్రాంతంలోనూ ఒక్క గూడెంకూడా లేదు. ఇప్పుడు బాబా విషయానికి వద్దాం. బాబా మనుషులూ గుర్రాలూ రోజులకు రోజులు బయటకు రాకుండా స్థావరంలోనే వుంటూ వుంటారు. నీరు లేకపోతే వాళ్ళు వుండలేరు. కాబట్టి ఆ ప్రాంతంలో ఎక్కడ నీరు పుష్కలంగా దొరుకుతుందో, అక్కడే బాబా స్థావరం వుంటుందనటంలో నూరుపైసల సత్యం వుంది" అన్నాడు మాస్టారు.

అవినాష్ నోటిలోంచి అతనికి తెలియకుండానే చిన్న విజిల్ బయటకు వచ్చింది.

మాస్టారు అతని భుజం తట్టారు.

తూర్పు తెల్లవారుతోంది. "మీరు పగలు అక్కడకు వెళ్ళటం మంచిదికాదు. చీకటి పడేదాకా విశ్రాంతి తీసుకోండి. రాత్రి మీరు ప్రయాణం ప్రారంభించవచ్చు" అన్నారు మాస్టారు.

అవినాష్ తల వూపాడు.

ఆ గదికి ఆనుకుని వున్న మరో గదిని—మాస్టారు వారికి చూపించాడు.

గది మధ్య రెండు నులక మంచాలు—వాటిమీద మెత్తటి పరుపులూ—వాటిని చూడగానే అవినాష్కు

నిద్రముంచుకు వచ్చేస్తోన్నట్లనిపించింది.

"నేను మిమ్మల్ని సాయంత్రం కలుస్తాను. మిమ్మల్ని యెవరూ డిస్టర్బ్ చెయ్యరు. ఏదైనా అవసరం వస్తే ఆనిరమ్మను పిలవండి" అన్నారు మాస్టారు!

"మాస్టారూ! నాదో చిన్న సందేహం!" అన్నాడు అవినాష్.

"ఏమిటి?"

"మీరెప్పుడయినా బాబాను చూశారా?"

మాస్టారు చిన్నగా నవ్వారు. "బాబా నన్ను వారానికి రెండుసార్లయినా కలుస్తో వుంటాడు. అతడు తన సహాయక కార్యక్రమాలను నాద్వారా జరిపిస్తో వుంటాడు" అన్నారు.

అవినాష్ ఆశ్చర్యపోయాడు. "మరి మీరు మాకు యెందుకు యిన్‌ఫర్మేషన్ యివ్వలేదు?" అని అడిగాడు.

"అతడు నన్ను కలిసి తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు కానీ అతడు ఖాదర్‌బాబా అని నాకు తెలియదు."

"మీరు యిన్ఫార్మర్—అని అతనికి తెలుసా?"

"తెలియదనుకుంటాను. నేనంటే అతనికి చాలా గౌరవం. నేను అతని గురించి మీకు చెబుతోన్నానని తెలిస్తే అతని ప్రవర్తన యెలా వుంటుందో తెలియదు."

మరో పదినిముషాలు మాట్లాడి మాస్టారు బయటకు వెళ్ళిపోయారు.

## 5

జీపు ఘాట్ రోడ్డుమీద మెల్లగా పరుగెడుతోంది.

జెరిగొడ్డులా పాకిపోతున్న రోడ్డుకు ఒక వయిపున కత్తితో నరికినట్లున్న బండరాళ్ళు. మరోవైపు అగాధం. జీపు అటు తిరిగినా యిటు తిరిగినా ప్రమాదమే.

అవినాష్ జీపును ఏకాగ్రతతో నడుపుతున్నాడు. చలికి చేతులు వొంకర్లు పోతున్నాయి. ఒంటిమీదున్న జర్కిన్ గానీ దానిమీద కప్పుకున్న షాల్ గానీ చలిని ఆపలేకపోతున్నాయి.

ఊర్మిళ పరిస్థితి కూడా అలానే వుంది. పళ్ళు గిట్ట కరుచుకు కూర్చుంది.

రాత్రి ప్రయాణాన్ని ముందుగానే వూహించిన అవినాష్ తనతో ఒక చిన్న బ్యాటరీ హీటర్ను తీసుకు వచ్చాడు. ఆ హీటరు జీపులో పనిచేస్తోన్నా చలిగాలి ప్రభావం మాత్రం ఏమీ తగ్గలేదు.

"కొంచెం టీ త్రాగి బయలుదేరుదాం!" అంది ఊర్మిళ.

జీపును ఒక చదునయిన ప్రదేశం దగ్గరకు పోనిచ్చి రోడ్డుకు బాగా యివతలగా తీసి ఆపాడు అవినాష్.

ఫ్లాస్కులోంచి టీని రెండు కప్పులలో పోసింది ఊర్మిళ.

వేడి టీ లోపలకు వెళుతోంటే కొంచెం హాయిగా వుంది వాళ్ళకు.

"ఎంత దూరం వచ్చాం?" అంది ఊర్మిళ.

అవినాష్ జేబులోంచి మ్యాప్ తీసి చూశాడు. "ఇంకో ముప్పై మైళ్ళు వెళితే మనం గమ్యం చేరుకున్నట్లే" అన్నాడు అవినాష్.

"అయితే యింకో గంటసేపు చలికి ప్రయాణం వుందన్నమాట."

"అంతకన్నా యెక్కువ వేగంతో వెళ్ళటం ప్రమాదం."

మళ్ళీ ప్రయాణం మొదలయింది.

అవినాష్ సిగరెట్ వెలిగించి గుండెలనిండా పొగ నింపుకుని కదులుతోన్నాడు. ఊర్మిళ జీపు వెనక్కి వెళ్ళి పడుకుంది.

ప్రయాణం అరగంట పైచిలుకు సాఫీగానే జరిగింది.

జీపును నడుపుతోన్న అవినాష్ యెందుకో ఉలిక్కి పడ్డాడు. అతని సిక్స్త్ సెన్స్ అతడిని హెచ్చరించింది. జీపును ఆపాడు. దూరంగా గుర్రపుసకిలింపు వినిపించింది.

కుదుపుకు ఊర్మిళ లేచింది. "ఏం జరిగింది?" అంది.

"ఉష్!" అన్నాడు అవినాష్.

జీపు వెనకనుండి పెద్ద పగ్గం తీశాడు. పగ్గం చివర్ని జీపు వెనక వున్న కొక్కానికి కట్టాడు. పగ్గం రెండో చివర్ని రోడ్డువారగా వున్న చెట్టుకు కట్టాడు. సంగతేమిటో తెలియకపోయినా ఊర్మిళ అతనికి సాయపడుతోంది. ఇద్దరూ కలసి జీపును పల్లంలోకి తోశారు. అదృష్టం బాగుండి ఆ ప్రాంతం చదునుగానే వుంది. శాఖీ ముక్కలను తొక్కుకుంటూ జీపు ముందుకుపోయి ఆగింది. అవినాష్ కంగారుపడుతూ, ఊర్మిళ చేతిని అందుకున్నాడు. ఆమెను తీసుకుని జీపు వారగా పరుగెట్టాడు.

రెండు నిముషాల తరువాత రోడ్డుమీద గుర్రాలు ప్రత్యక్షమయ్యాయి. గుర్రాలు పరుగెట్టటంలేదు. నెమ్మదిగా నడుస్తోన్నాయి. గుర్రాలమీదున్న ఆగంతకుల మొహాలు వెన్నెల్లో క్రూరంగా కనిపిస్తోన్నాయి.

పదినిముషాలు పోయాక అవినాష్ లేచి నిలబడ్డాడు.

అదురుతున్న గుండెని అదుపులో పెట్టుకుని ఊర్మిళ లేచింది.

ఆ పదినిముషాలూ, చల్లగా వీస్తోన్న గాలి వారిని ఏమీ చెయ్యలేకపోయింది.

ప్రమాదం దాటిపోగానే చలి మొదలయింది.

అవినాష్ రోడ్డు మీదకు వచ్చాడు.

"నువ్వు జీపు స్టార్టు చేసి రివర్సులో రా! నేను వెనక నుండి పగ్గంపట్టుకు లాగుతాను" అన్నాడు.

ఊర్మిళ జీపు స్టార్ట్ చేసింది. రివర్సు గేరు వేసింది.

జీపు విపరీతమయిన శబ్దం చేసిందే తప్ప వెనక్కు రాలేదు.

కాళ్ళు రెంటినీ చెట్టుకు బోటు పెట్టి బలాన్నంతటినీ ఉపయోగించి పగ్గాన్ని రెండు చేతులమధ్య ఇరికించుకుని జీపును వెనక్కు లాగసాగాడు అవినాష్.

అవినాష్కు చేతులు ఒరుసుకుపోతున్నాయి. చెమటా, రక్తం కలసి పగ్గం తడయిపోతోంది. అయినా పళ్ళ బిగువున బాధను భరించి అవినాష్ పగ్గాన్ని లాగుతూనే వున్నాడు.

అయిదు నిముషాలు గడిచింది. వారి ప్రయత్నం ఫలించింది. జీపు నెమ్మదిగా పైకిరాసాగింది. అవినాష్లో ఉత్సాహం పెరిగింది. లేని సత్తువ తెచ్చుకుని పగ్గాన్ని లాగటం మొదలు పెట్టాడు.

జీపు దాదాపుగా రోడ్డు దగ్గరకు వచ్చేసింది.

అంతే—అంతలోనే జరగకూడనిది జరిగిపోయింది.

అవినాష్ దన్ను పెట్టిన చెట్టు, వేళ్ళతో సహా వూడిపోయింది. చెట్టు అవతల భాగం నేలంతా పెళ్ళలా వూడిపోయింది.

ఆధారంలేక అవినాష్ ముందుకు తూలిపడిపోయాడు.

జీపు ఎవరి ప్రయత్నం లేకుండానే ముందుకు జారిపోయింది. ఊర్మిళకు తెలియకుండానే గేరు న్యూట్రల్లో పడిపోయింది. వేగంగా ముందుకుపోతున్న జీపులో

కూర్చున్న ఊర్మిళకు విషయం బోధపడలేదు, భయంతో స్పృహ తప్పి స్టీరింగ్ మీద వ్రాలిపోయింది.

దాదాపు రెండు నిముషాలు క్రిందకు దొర్లాడు అవినాష్.

మూడంటు రాయిలూ, చెట్లమోడులూ తగిలి అతని ఒళ్ళంతా గీరుకుపోయి సలుపుతోంది.

అగాధంలోకి దొర్లిపోతున్న జీపు వయిపు అతడు నిస్సహాయంగా చూసి "ఊర్మిళా!" అని అరిచాడు.

కానీ ఆ అరుపు అతని గొంతు పెగిలి బయటకు రాలేదు.

జీపు దిగిపోయిన వైపుకు పిచ్చిగా పరుగెట్టాడు అవినాష్. విచిత్రం అదంతా సాఫీ అయిన స్లోపే తప్ప అగాధంగానీ, ఎగుడుదిగుళ్ళుగానీ లేవు.

అవినాష్‌లో ఉత్సాహం పెరిగింది. పరుగు పెడుతూ ముందుకు సాగిపోయాడు.

పదినిముషాలలో అతడు జీపును చేరుకున్నాడు.

పగ్గం కట్టిన చెట్టు రెండు చెట్లమధ్య ఇరుక్కుని వుండిపోయింది. అందుకే జీప్ ఇక ముందుకు వెళ్ళక ఆగిపోయింది.

అదురుతున్న గుండెలతో జీపు దగ్గరకు వచ్చి డ్రయివింగ్ వీల్ వయిపు చూశాడు అవినాష్. స్టీరింగ్ మీదకు వొరిగి వుంది ఊర్మిళ. ఒక్క క్షణం అవినాష్‌కు వూపిరి స్తంభించిపోయింది.

వణుకుతోన్న చేతులతో ఊర్మిళను తాకాడు.

ఒళ్ళు వెచ్చగా వుంది. ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు—ఊర్మిళ బ్రతికే వున్నట్లు గ్రహించి హాయిగా వూపిరి పీల్చాడు.

జీపు వెనక్కి వచ్చి వాటర్ బాటిల్ తీశాడు. చేతిలో నీళ్ళుపోసుకుని ఊర్మిళ మొహంమీద చిలకరించాడు.

ఊర్మిళ మెల్లిగా కళ్ళు తెరిచింది. చివురుటాకులా వణికిపోయింది. "ఏమండీ!" అంటూ అవినాష్‌ను వాటేసుకుంది.

అవినాష్ ఆమెను ఓదార్చాడు.

అంతలోనే అవినాష్ అలర్టయ్యాడు.

"ఊర్మిళా గెట్ డౌన్!" అంటూ ఆమెను తీసుకుని జీపు వెనక్కి వెళ్ళాడు. జీపు వెనుకనుండి స్టెన్ గన్‌ను తీసి స్టడీగా కూర్చున్నాడు.

మరు నిముషం వాళ్ళకు ఇరవై గజాల దూరంనుండి గుర్రాల గుంపొకటి అతి వేగంగా దూసుకుపోయింది.

"మై గాడ్!" అనుకుంది ఊర్మిళ గుండెలమీద చెయ్యి వేసుకుని.

"ఊర్మిళా! వుయార్ లక్కీ. మన జీప్ గనుక ఇలా దొర్లకపోతే మనం ఈ గుంపుకు దొరికిపోయి వుండే వాళ్ళం. తప్పించుకునే అవకాశంకూడా వుండకపోను" అన్నాడు అవినాష్.

ఊర్మిళ భయంతో రొప్పుతోంది.

అవినాష్ జీపులోంచి టార్చిలైటు తీశాడు. ముందుకు వేశాడు. లైటు కాంతిలో రోడ్డు మెరుస్తోంది.

"మనం అడ్డుతోవన వచ్చామన్నమాట" అంటూ ఊర్మిళ వయిపు చూశాడు.

"మనకు దైవబలం వుంది" అంది ఊర్మిళ.

"నువ్వు జీపు ఎక్కి స్టార్టు చెయ్యి. నేను తాడు తప్పిస్తాను" అన్నాడు అవినాష్.

ఊర్మిళ జీప్‌ను స్టార్ట్ చేసింది.

అవినాష్ పగ్గాన్ని తొలగించాడు.

జీపు పూర్తిగా రోడ్డుమీదకు వచ్చేసింది.

ఈసారి డ్రయివింగ్ బాధ్యతను ఊర్మిళే తీసుకుంది.

రోడ్డుమీద జీపు పరుగెడుతోంది.

మరో గంటలో జీపు సమతలమయిన అరణ్యంలో ప్రవేశించింది.

అది పక్కా రోడ్డు కాదు.

జీపు కల్లు తాగినట్లు తూలుతోంది.

మరికొంత సేపయినాక కదలనని మొరాయించింది.

అప్పుడు టయిమ్ తెల్లవారుజాము నాలుగు గంటలు దాటింది.

"ఇక జీపు లాభంలేదు. కాళ్ళకు పని చెప్పాలి" అన్నాడు అవినాష్.

ఇద్దరూ జీప్ దిగారు. కావలసిన సామానులను రెండు పెద్ద బ్యాగులలో సర్దేశారు. తలో బ్యాగును వీపుకు తగిలించుకున్నారు. జీపును గుబురుగా వున్న చెట్లలోపు మధ్యకు తోసేశారు. నెమ్మదిగా నడక మొదలుపెట్టారు.

ఇద్దరికీ బాగా అలసటగా వుంది. వాళ్ళు గుబురుగా వున్న చెట్ల మధ్యకు నడిచారు.

ఒక చెట్టు మొదలు దగ్గర బాగా చదునుగా వుంది. కర్రలను చిదుగులను, చిన్న చిన్న రాళ్ళను ఏరేసి, దుప్పట్లు పరిచారు. మొహాలు కడుక్కొని, సుష్టుగా ఫలహారం చేసి, కాఫీ త్రాగారు.

"ఇక మనకు టిన్డు మీట్, బ్రెడ్, కోల్డు కాఫీలే గతి" అంది ఊర్మిళ.

భార్యను ఆప్యాయంగా చూసి "పని సాధించాలంటే

ఆ మాత్రం కష్టపడక తప్పదు" అన్నాడు అవినాష్.

అవినాష్‌కు నిద్ర ముంచుకు వస్తోంది. కళ్ళు మూతలు పడిపోతోన్నాయి.

"మనం ప్రస్తుతం విశ్రాంతి తీసుకుందాం. ముందు యెవరికి మెలుకువ వస్తే వాళ్ళు లేచి, రెండో వాళ్ళని లేపుదాం" అంటూ సమాధానం గురించి చూడకుండా ముసుగుతన్నాడు అవినాష్.

భర్తను ఆప్యాయంగా చూసి ఊర్మిళ కూడా నిద్ర కుపక్రమించింది.

# 6

'బీప్, బీప్' మని శబ్దం రావటంతో అవినాష్ ఉలిక్కిపడి లేచాడు.

ప్రక్కనే వున్న వాకీటాకీ ఆదేపనిగా సిగ్నల్ యిస్తోంది. వాకీటాకీని చేతిలోకి తీసుకుని "హాలోవ్!" అన్నాడు అవినాష్.

సమాధానం లేదు. సిగ్నల్ మాత్రం వస్తోంది.

ప్రక్కకు చూశాడు అవినాష్,

ప్రక్కనే ఖాళీగా వున్న పక్క అతన్ని వెక్కిరిస్తూ చూస్తోంది. అవినాష్‌కు ఒళ్ళంతా చెమటతో తడవటం ఆరంభించింది. "ఎక్కడికి వెళ్ళింది?" అనుకుంటూ లేచి నిలబడ్డాడు.

"ఊర్మిళా!" అంటూ నాలుగయిదుసార్లు గట్టిగా పిలిచాడు. ఫలితం శూన్యం!

వాకీటాకీ మాత్రం నిస్తేజంగా అరుస్తోనే వుంది.

వాకీటాకీని చేతిలోకి తీసుకుని సర్ది చూశాడు. ప్రయోజనం కనిపించలేదు.

తప్పి జారి విడిపోవలసి వస్తే ఒకరి వునికిని మరొకరు

తెలుసుకునేందుకు వీలుగా అవినాష్ వాకీటాకీలను ఏర్పాటు చేశాడు.

మొదట్లో ఊర్మిళ యే బయలుభూమికో వెళ్ళిందనుకున్నాడు. తర్వాత ఆ అనుమానం తప్పని తేలింది. ఊర్మిళ తన బ్యాగ్‌నూ, తనకు సంబంధించిన యితర సామాన్లనూ తీసుకువెళ్ళిపోయింది.

ఎందుకు చేసిందలా? ఏ క్రూరమృగమయినా తీసుకుపోయిందా—అంటే! ఆ జాడలేదు. ఎవరి బలవంతం మీదయినా వెళ్ళిందా అంటే; తనకు కావాల్సిన సామానులనన్నింటినీ తీసుకుని బందోబస్తుగా బయలుదేరదు. మరయితే ఒంటరిగా యెందుకు వెళ్ళింది? వెళ్ళేటప్పుడు కనీసం తనతో యెందుకు చెప్పలేదు? అలా వెళ్ళిపోవటానికి కారణం ఏమిటి?

ఒకటి జరిగివుండాలి!

ఏదో అనుమానం వచ్చి, ఎవర్నో వెంబడించి వుండొచ్చు—తనను లేపటానికి కూడా సమయం లేక పోవచ్చు. మరయితే వాకీటాకీ! అదే పనిగా మ్రోగటం తప్ప అదెందుకూ పనికి రాకుండా పోయింది. అంటే ఊర్మిళ వాకీటాకీని వుపయోగించే స్థితిలో లేదన్న మాట. అయితే ఏం జరిగివుండొచ్చు?

ఇక వూహించలేక అవినాష్ కళ్ళు మూసుకున్నాడు. అతని మనసు పరిపరి విధాల పోతోంది.

దుప్పట్లు మడచి బ్యాగ్‌లో సర్దేశాడు. బ్యాగ్‌ను భుజానికి తగిలించుకుని, నెమ్మదిగా ముందుకు అడుగులు వేశాడు.

చీకటిపడుతోంది.

చలిగాలి వీచటం ఆరంభించింది.

చేతిలో వున్న వాకీటాకీ ఆధారంగా అతడు ముందుకు సాగిపోతోన్నాడు.

దాదాపు రెండుగంటలు పైచిలుకు నడిచాడు. అతనిలో ఆత్రుత అధికమయింది.

ఊర్మిళ దగ్గరవున్న వాకీటాకీకి తను చేరువలోకి వచ్చాడు. శబ్దాలను అతి జాగ్రత్తగా గమనిస్తూ ముందుకు వెళ్ళాడు.

ఆ దగ్గర్లోనే వాకీటాకీ వున్నట్లుగా అతని దగ్గరున్న వాకీటాకీ చెబుతోంది.

బ్యాగ్‌లోంచి టార్చితీసి ముందుకు ఫోకస్ చేశాడు అవినాష్.

అడవిలో విపరీతంగా పెరిగిన చెట్లూ, వాటి నీడలూ; టార్చిలైటు కాంతిలో వింతగా అగుపించాయి. టార్చిని వలయంలా తిప్పుతూ చుట్టూ గమనించాడు. ఎక్కడా ఊర్మిళ వున్న జాడ కనిపించలేదు.

గొంతు పెగల్చుకుని భార్యను పిలవబోయి, ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

ఆ పదడుగుల వ్యాసార్థంలోనే అతడి అన్వేషణ జరిగింది.

ఎక్కడా ఏ ఆధారం లభించలేదు.

అతడికి సమయం గుర్తుకు రావటంలేదు. అప్పుడే అతడు బయలుదేరి ఏడుగంటలు దాటింది.

దగ్గర్లో కీచురాళ్ళ అరుపులూ, దూరంగా వినవచ్చే క్రూరమృగాల గర్జనలూ, అతడిని ఏ మాత్రం భయపెట్టటం లేదు. ఎముకలని కొరకగలిగే చల్లటి గాలి, అది చేసే మృత్యునాదం, అతనిమీద ప్రభావాన్ని చూపలేక పోతున్నాయి. అంత పెద్ద మహారణ్యంలో అతడు

ఒంటరితనాన్ని అనుభవించటంలేదు. ఊర్మిళ తాలూకు ఊహలతో అతడు బాహ్యాన్ని మరచిపోయాడు. అలా గని కర్తవ్యాన్ని విడచే భీరువు మాత్రం కాదు.

సమయం సాగిపోతోంది—దాంతోపాటే—అంత వేగంగా కాకపోయినా అవినాష్ అన్వేషణ కూడా సాగుతూనే వుంది.

చిట్టచివరకు అతడు ఒక అగాధం దగ్గరకు వచ్చాడు.

అవినాష్ గుండె చప్పుడు పెరిగింది. అతడికి వెన్నులోంచి చలి మొదలయింది.

అవును అగాధంలోంచే వాకీటాకీ తన వునికిని చెబుతోంది—అయితే ఊర్మిళ—అవినాష్ కళ్ళు చెమర్చాయి.

వెంటనే టార్చిని అగాధంలోకి ఫోకస్ చెయ్యలేకపోయాడు.

పది నిముషాలు అలానే నిలబడిపోయాడు. ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు.

వణుకుతోన్న చేతులతోనే అగాధంలోకి టార్చిని ఫోకస్ చేశాడు.

దాన్ని అగాధం అనేకన్నా, శంకువు ఆకారంలో వున్న నుయ్యి అనవచ్చు.

అడుగు కనిపించటం కష్టంగానే వుంది. అగాధ వట్రువుకు దుబ్బుగా పెరిగిన చెట్లు ఒకరకమయిన రూపాన్ని దిద్దుతోన్నాయి. ఆ చెట్లలో ఒకదాని కొమ్మకు తగులుకుని వ్రేలాడుతోంది ఊర్మిళ దగ్గర వుండాల్సిన వాకీటాకీ. అగాధంలోకి మనిషి దొర్లిన జాడ ఏమీ లేదు. మనిషి అడుగుకు చేరుకోవటం కష్టం. మనిషంటూ అగాధంలోకి జారితే చెట్లలో చిక్కుకుని వుండాలి. అలాంటప్పుడు మనిషి పైకి కనిపిస్తుంది.

ప్రాణంపోయే అవకాశం యెంతమాత్రం లేదు.

అయితే ఊర్మిళ అగాధంలో పడిపోలేదు. మరయితే శత్రువుల చేతుల్లో చిక్కిందా....వాళ్ళు ఆమెను ఏం చేస్తోన్నారో—

ఆలోచిస్తోన్న అవినాష్‌కు పదిగజాల దూరంలో తెల్లటి వస్తువు కనపడింది. అతడు అటు పరుగెట్టాడు. అతని కళ్ళు మెరిశాయి. అది ఊర్మిళ కాలిజోడు. దాని మడమ చెట్టు వయిపుకు వుంది. అంటే ఊర్మిళ సూటిగా ముందుకు వెళ్ళిందన్నమాట. తనకు సూచన యివ్వటానికి చెప్పును ఆ దిశలో వదిలిందన్న మాట. అవినాష్ ఆమెను అభినందించకుండా వుండలేకపోయాడు. చెప్పును తీసి బ్యాగ్‌లో వేసుకొన్నాడు.

ఊర్మిళ సూచించిన దిశలో అవినాష్ తన ప్రయాణాన్ని సాగించాడు. అరగంట నడిచేటప్పటికి అతడికి మరో చెప్పు ఎదురయింది.

ఇప్పటి వరకూ తన ప్రయాణం సక్రమంగానే జరిగిందన్నమాట. ఈ చెప్పును కూడా తీసి బ్యాగ్‌లో వేసుకుని నడక మొదలుపెట్టాడు. ప్రతి పదినిమిషాలకు ఏదో వస్తువును ఊర్మిళ తనకోసం జారవిడుస్తూనే వుంది.

మధ్యాహ్నం ఒంటిగంట దాటింది.

అవినాష్‌కు నడిచే ఓపిక పోయింది. అయినా గమ్యం చేరుకోవాలనే వుద్దేశంతో నడక సాగిస్తోనే వున్నాడు.

రెండవుతోందనగా అతనికి ఊర్మిళ బ్యాగ్ కనిపించింది. అవినాష్ అప్పటివరకు తను పోగేసిన ఊర్మిళ వస్తువులన్నిటినీ ఆ బ్యాగ్‌లో సర్దాడు. ఆ ప్రాంతాన్ని సునిశితంగా పరీక్షించాడు. అక్కడ గుర్రాల అడుగు జాడలూ, వాటిని అక్కడ చెట్లకు కట్టిన గుర్తులూ

వున్నాయి. గుర్రపు డెక్కల గుర్తులు నాలుగువైపులా వ్యాపించి వున్నాయి. ఇప్పుడు ఎటు వెళ్ళాలో తేల్చుకోలేని స్థితి అతనిది.

అందుకే కొంతసేపు ప్రయాణాన్ని ఆపి విశ్రాంతి తీసుకోవాలన్న నిశ్చయానికి వచ్చాడతడు. దానికి సాయం, అతనికి కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి. ముందు ఆత్మారాముడు తృప్తిపడాలి. లేకపోతే నీరసం ఆవహిస్తుంది.

అవినాష్‌ను అక్కడకు కొంచెం ఎడంగా వున్న చదునయిన ప్రదేశం ఆకర్షించింది.

నెమ్మదిగా అటు నడిచాడు. దుప్పటి పరిచాడు. ఒక్కసారిగా అతనికి విశ్రాంతి కావాలనిపించింది. దుప్పటిమీద పడుకుని బ్యాగ్‌లోంచి బ్రెడ్ తీసి, ఒక్కొక్క స్లయిస్‌నూ సావధానంగా తినటం ప్రారంభించాడు.

చెట్ల నీడ, వాటిమీంచి వచ్చే చల్లని గాలి అతడిని సేద తీరుస్తున్నాయి. అప్పటివరకు అతడు పడిన కష్టం తాత్కాలికంగా మరచిపోయాడు.

చెట్టుకేసి చూస్తూ బ్రెడ్ తింటోన్నాడు.

అంతలో అతని దృష్టి, చెట్టుమీద కూర్చుని తనవైపే చూస్తోన్న కోతిమీద పడింది. అది అతడిని ఆశగా చూస్తోంది.

అవినాష్ చిన్న బ్రెడ్‌ముక్కను విసిరాడు. అది దూరంగా పడింది. కోతి చటుక్కున క్రిందకు దిగి బ్రెడ్ ముక్కను అందుకుని, ఆబగా తినేసి అవినాష్ వయిపు ఆప్యాయంగా చూసింది.

అవినాష్ మరో బ్రెడ్‌ముక్కను అటు విసరాడు.

దాన్నికూడా కోతి అప్యాయంగా తీసేసింది.

అంతలోనే అవినాష్‌లో ఓ చక్కటి ఆలోచన రూపు దిద్దుకుంది.

"నీరు వున్న చోటే అతని స్థావరం వుండితీరాలి!" అన్న మాస్టారి మాటలు అతనికి గుర్తుకు వచ్చాయి.

అవును యిక్కడున్న జంతువులకు ఈ ప్రాంతంలో నీరు యెక్కడ వుందో తెలిసి తీరుతుంది.

అంతే. అవినాష్ తనకు వచ్చిన ఆలోచనను ఆచరణలో పెట్టదలిచాడు.

మరో చిన్న బ్రెడ్ ముక్కను తనకు కొంచం దగ్గరలో విసిరాడు. కోతి దగ్గరకు వచ్చి దానిని అందుకుని తినేసింది. అలా నాలుగయిదు ముక్కలు ఖర్చయ్యేటప్పటికి, కోతి అతనికి బాగా దగ్గరగా వచ్చేసింది.

దానికి ముక్కలు విసురుతూనే అవినాష్ బ్యాగ్ లోంచి, పొడవుపాటి తాడును బయటకు తీశాడు. ఆ తాడుకు ఒక చివర చిన్న వుచ్చులా తయారు చేసి, దానిని ఒడుపుగా కోతిమీదకు విసిరేడు. ఆ వుచ్చు తిన్నగా పోయి కోతి మెడకు బిగుసుకుంది. తాడు రెండో చివరను చెట్టుకు కట్టేశాడు.

మొదట్లో కోతి విపరీతంగా గింజుకుంది, కానీ తర్వాత అవినాష్ వేస్తోన్న బ్రెడ్ ముక్కలను, పావ్ కారన్ గింజలనూ ఆపిల్ ముక్కలను సుష్టుగా ఆరగించటం మొదలు పెట్టింది. అయిదు నిముషాలు గడిచాక, మళ్ళీ కోతి గింజుకోవటం ప్రారంభించింది.

అవినాష్‌లో ఉత్కంఠ ఆరంభమయింది. తన ప్రయత్నం ఫలించబోతోంది.

బ్యాగ్ లోంచి చిన్న ట్రాన్స్మిటర్ తీసి దాని

మెడకు బిగించి కట్టాడు.

వాటర్ బాటిల్ తీసుకుని దానికి దగ్గర్లో నీటిని ధారగా పోశాడు. నీటిని చూసి కోతి పిచ్చిగా గెంతులు వేయటం ఆరంభించింది. నీటిని అందుకోవటానికి వ్యర్థ ప్రయత్నం జరిపింది.

అవినాష్ మరో అయిదు నిమిషాలు ఆగాడు.

కోతి వింతగా అరుస్తూ అతడిని జాలిగా చూడటం ఆరంభించింది.

చెట్టుకు కట్టిన తాడును వూడదీశాడు అవినాష్.

అంతే__వింటినించి సంధించిన బాణంలా ముందుకు పరుగెట్టింది కోతి.

రిసీవర్ ని చేతిలో బిగించి పట్టుకుని, బ్యాగ్ లను నడ్డికి కట్టుకుని దాని వెంట పరుగెట్టాడు అవినాష్.

## 7

మధ్యాహ్నం పన్నెండు గంటల సమయం.

ఊర్మిళ నిద్రపట్టక అటూ యిటూ దొర్లుతోంది.

ప్రక్కన అవినాష్ ఆదమరచి నిద్ర పోతున్నాడు.

ఊర్మిళ మురిపెంగా భర్తను చూస్తోంది.

అంతలో వారికి కొంచెం దూరంలో మాటలు వినిపించాయి. కనీసం ముగ్గురయినా వుంటారని ఊహించింది ఊర్మిళ. వారి మాటలను బట్టి వాళ్ళు ఖాదర్ బాబా అనుచరులని గ్రహించింది.

నెమ్మదిగా పైకిలేచి కొంచెం ముందుకు వెళ్ళింది.

ముగ్గురు దున్నపోతుల్లాంటి ఆకారాలు. హాయిగా కబుర్లు చెప్పుకుంటూ ముందుకు అడుగులు వేస్తున్నారు. వాళ్ళ వెనుక మూడు గుర్రాలు వారికంటే ధీమాగా

వాళ్ళని అనుసరిస్తోన్నాయి.

దూరంగా వుండి వాళ్ళను అనుసరిస్తే సాఠరం దొరక వచ్చు—

ఈ ఆలోచన రాగానే ఊర్మిళ గిరుక్కున వెనక్కు తిరిగి తాము పడుకున్న చోటికి వచ్చింది. అవినాష్‌ను లేపుదామనుకుని, ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది.

నిన్నటినుండి బాగా అలసిపోయి వున్నాడు. అతనికి విశ్రాంతి అవసరం. తన దగ్గర ఎలాగూ వాకీ టాకీ వుంది. ఒకవేళ ఏదయినా జరిగితే తమ యిద్దరికీ ప్రమాదమే—అలాంటప్పుడు అవినాష్ ఆశయం నెరవేరదు. తను ప్రమాదంలో ఇరుక్కున్నా పర్వాలేదు—ఖాదర్ బాబా సాఠరం కనుగొని అవినాష్‌కు తెలిపితే—కాగల కార్యాన్ని గంధర్వులే తీరుస్తారు. భార్యగా తాను ఆ మాత్రం రిస్కు తీసుకోక తప్పదు—

ఈ ఆలోచన రాగానే ఊర్మిళ తాత్సారం చెయ్య లేదు. తనకు సంబంధించిన సామానులను బ్యాగ్‌లో సర్దేసింది. పిస్టల్నూ, మిషిన్ గన్నునూ జాగ్రత్తగా లోపల ఉంచింది. అవినాష్ నుదిటిని ఆప్యాయంగా చుంబించింది. బ్యాగ్‌ను వీపుకు తగిలించుకొంది. ప్రయాణానికి సన్నద్ధమయింది. బాబా మనుషులను అనుసరించటం ఆరంభించింది.

ముందు నడుస్తోన్న మనుషులు తమను ఒకరు అనుసరిస్తోన్న విషయం తెలియక తమ రహస్యాలన్నిటిని దాపరికం లేకుండా మాట్లాడుకుంటోన్నారు.

వాళ్ళు మాట్లాడుకుంటోన్నవి పూర్తిగా వినపడక పోయినా సారం మాత్రం గ్రహించగలుగుతోంది ఊర్మిళ.

వాళ్ళు నాలుగయిదు చోట్ల ఆగి విశ్రాంతి తీసుకుని మళ్ళీ బయలుదేరుతున్నారు.

వాళ్ళకు అనుమానం రాకుండా ఊర్మిళ ఫాలో అవుతోంది.

సమయం నాలుగవుతోందనగా, వారి సంభాషణ సారాన్ని పూర్తిగా అవగతం చేసుకుంది ఊర్మిళ.

విజయనగరంలో నాలుగు రోజులలో అమ్మవారి పండుగ జరుగనుంది. ఆ రోజున పెద్ద ఎత్తున దోపిడీకి రంగం సిద్ధం చేస్తోన్నాడు ఖాదర్ బాబా.

ముందుగా ఈ విషయాన్ని వాకీటాకీలో అవినాష్‌కు చెప్పాలి. తర్వాత అతడు తన దగ్గరున్న ట్రాన్స్‌మీటర్‌తో విషయాన్ని పై అధికార్లకు వివరిస్తాడు.

ఊర్మిళ వాకీటాకీని ఆన్ చేసింది. అటునయిపుకు సిగ్నల్ వెళుతోంది. బాబా మనుషులను చూసుకుంటూ ముందుకు నడుస్తోన్న ఊర్మిళ రాబోయే ప్రమాదాన్ని పసిగట్టలేకపోయింది. పెనుభూతంలా నోరావలించుకుని ఆమెకు యెదురుగా ఒక అగాథం ఎదురుచూస్తోంది. వాకీటాకీ గురించి ఆలోచిస్తూ ముందుకు అడుగు వేయబోయిన ఊర్మిళ తృళ్ళిపడింది. మనిషి ముందుకు తూలిపోయింది. కొంచెం వుంటే అగాథంలో పడిపోయేదే—అదృష్టం కలిసొచ్చి ఆమె రెండు చేతులతోనూ అగాధం అంచున వున్న చిన్న చెట్టును పట్టుకొంది. వాకీటాకీ మాత్రం ఆమె చేతిలోంచి జారి అగాథంలోకి పడిపోయింది.

ఆ షాకునుండి తేరుకోవటానికి ఊర్మిళకు దాదాపుగా పదినిముషాలు పైనే పట్టింది.

అవినాష్‌తో మాట్లాడలేకపోయినందుకు ఆమె చాలా బాధపడింది. బాబా మనుషులు దూరంగా వెళ్ళిపో

తున్నారు. ఒంటరిగా వారిని అనుసరించటం అవివేకమేమో అనిపించింది ఊర్మిళకు. కానీ రోటిలో తల దూర్చి రోకలిపోటుకు భయపడటం అవివేకమనిపించింది. పోనీ వెనక్కు తిరిగిపోదామంటే తనకూ ఇప్పటివరకూ తాను ప్రయాణం చేసిన తోవ తెలియదు.

ఆమెలో మొండిధైర్యం ప్రవేశించింది.

బాబా మనుషులను వెంబడించటం ఆరంభించింది.

వాకీటాకీ చేసే శబ్దానికి లేచి తను ప్రక్కన లేకపోతే అవినాష్ కంగారుపడతాడు.

వాకీటాకీ ఆధారంగా అగాధం వరకూ వస్తాడు. తరవాత అతనికి తను వెళ్ళిన త్రోవ తెలియాలి. అంటే తను ఏదో ఒకటి చెయ్యాలి.

వెంటనే ఊర్మిళకు ఒక ఆలోచన స్ఫురించింది. కాలి జోడును తీసి మడమను అగాధంవైపు వుంచింది ఇప్పుడు ఆ జోడు తను వెళుతోన్న దిశను సూచిస్తోంది. అదృష్టం బాగుండి జోడు కదలకపోతే మాత్రం అవినాష్ తను వెళుతోన్న మార్గాన్ని స్పష్టంగా గుర్తించి తీరతాడు.

ఇప్పుడు ఊర్మిళ హుషారుగా ముందుకు సాగిపోయింది.

మరి కొంతసేపయినాక మరో జోడునుకూడా ఇదివరకటి జోడులాగానే ఏర్పాటు చేసింది.

ఇప్పుడు ఆమెకు చాలా తృప్తిగా వుంది. ఈ పాటికి అవినాష్ బయలుదేరి వుంటాడు.

మరో పది నిముషాలు పోయిన తరువాత కాళ్ళకు చెప్పులు లేకపోవటంవలన కలిగే యిబ్బంది ఆరంభమయింది. సుకుమారమయిన పాదాలలో ముళ్ళూ రాళ్లూ దిగి బాధ పెడుతున్నాయి. పాదాలలోంచి రక్తంకూడా వస్తోంది. అన్నింటికీ ఓర్చుకుని బాబా అనుచరులను

వెంబడిస్తోంది. తను నడుస్తోన్న మార్గంలో అవినాష్ తన మార్గాన్ని తెలుసుకోవటానికి వీలుగా ఒక్కొక్క వస్తువును జారవిడుస్తోంది.

వారి ప్రయాణం మరో గంట సాగింది.

చివరకి ఊర్మిళ దగ్గర బ్యాగ్ మాత్రమే. మిగిలింది.

దాన్ని కూడా జారవిడిచింది.

అవినాష్కు తను అంతవరకే దారిచూపగలిగింది. సావరందాకా రావటం ఇక అదృష్టంమీద ఆధారపడి వుంటుంది.

బాబా అనుచరులు చటుక్కున ఒకచోట ఆగారు. ఊర్మిళకు గుండెలు అదిరాయి. ఆ ప్రాంతం అంతా మైదానంలా వుంది. తప్పుకోవటానికి యే రకమయిన మార్గమూ లేదు. ఖర్మకాలి వాళ్ళలో యెవరయినా వెనక్కి తిరిగితే తను వాళ్ల కంట పడటం ఖాయం. ఊర్మిళ గుండె బిగబట్టి అలానే నిలబడిపోయింది. వాళ్ళెవరూ వెనక్కి తిరగకూడదని వెయ్యి దేముళ్లకు మొక్కుకుంది.

మనం అనుకునేది ఒకటి జరిగేది మరొకటి.

ఏదయితే జరగకూడదని ఊర్మిళ కోరుకుందో అదే జరిగింది.

బాబా అనుచరులలో ఒకడు వెనక్కి తిరిగిచూశాడు. అంతే కొంపలు మునిగిపోయేలా కేకలు వేయటం ఆరంభించాడు.

ఆ కేకలకు మిగిలిన ఇద్దరూకూడా వెనక్కి తిరిగి చూశారు—అంతే "పట్టుకోండ్రా!" అంటూ కేక వేసి ఊర్మిళ వయిపు దూసుకు వచ్చారు.

అప్పటి వరకు చేష్టలుడిగి నిలబడివున్న ఊర్మిళ లేని

సత్తువను తెచ్చుకుంది. పిక్కబలంకొద్దీ వెనక్కు పరుగెట్టడం ఆరంభించింది.

ఆమె పరుగు లంకించుకోగానే ఆ ముగ్గురూ పిచ్చిపట్టినట్టు అరుస్తూ ఆమెను వెంబడించారు.

ముందు లేడిపిల్ల, వెనుక మదించిన మూడు పెద్దపులులు.

ప్రాణ రక్షణకు లేడిపరుగు, భక్షణకు పులులు.

పరుగెడుతోన్నదల్లా, కాలికి ఎండుపుల్ల తగిలి ముందుకు బోర్లా పడిపోయింది.

అంతే—ఆ ముగ్గురూ ఆమెను కమ్ముకున్నారు.

ఆమె చివురుటాకులా వణికిపోతోంది.

“ఎవరు నువ్వు?”

“మా వాళ్ళతో కలసి వేట చూడటానికి వచ్చాను. దారితప్పిపోయాను” ఊర్మిళ స్వరం నూతిలోంచి వచ్చినట్లు వుంది.

ముగ్గురు ఒకేసారి పకపకా నవ్వారు. “వేటకు ఎవరూ ఇక్కడివరకూ రారు. వచ్చినా నువ్వు దారితప్పవు. తప్పినా, చక్కటి బాటలున్న అటెటో పోతావుకానీ, రాళ్ళు రప్పలతో నిండివున్న ఇటు రావటానికి సాహసించవు” అన్నాడొకడు.

“నిజం. నన్ను నమ్మండి.”

ఊర్మిళ చెంప చెళ్ళుమంది. కళ్ళముందు బైర్లు కమ్మాయి. వెంటనే క్రిందపడిపోయింది.

“చచ్చిందేమోరోయ్!”

వాళ్ళలో ఒకడు ఆమె గుండెకు చెవి ఆనించాడు.

ఊర్మిళకు శరీరం అంతా చచ్చుబడినట్లయిపోయింది. క్రింద పడిపోయిందే కాని, స్పృహ పోలేదు. అయినా పరిస్థితులనుబట్టి స్పృహ పోయినట్లు నటించింది. కానీ

ఇప్పుడు పరాయి మగాడు ఒకడు తన ఎదను తాకు తోంటే భరించలేక పోతోంది. అయినా ఏమీ చెయ్య లేని పరిస్థితి ఆమెది. స్పృహ వున్నట్లు తెలిస్తే, జరగ బోయే ప్రమాదం చాలా దారుణంగా వుంటుంది. దాన్ని వూహించటమే కష్టం. అందుకే జరుగుతోన్న దాన్ని మౌనంగా భరించి కళ్ళు మూసుకుని వుండిపోయింది.

"గుంట మంచి రంజామీద వుంది! ఓ చూపు చూద్దామా?" అన్నాడొకడు.

"ఛ! నీ యవ్వ! చచ్చినట్లు పడున్న ఆడదానిమీద అఘాయిత్యం చేస్తావా?" మందలింపు.

మొదటివాని మాటలతో ఊర్మిళ గుండె ఆగిపోవల సిందే! కానీ రెండోవాని మందలింపు ఆమెకు ధైర్యాన్ని ఇచ్చింది. "స్పృహ లేనట్లు పడిపోవటం ఇందుకు ఉపయో గించిందన్న మాట."

"అయితే దీన్ని ఏం చేద్దాం?"

"ఏం చేయటం ఏముంది. బాస్ దగ్గరకు తీసుకు పోదాం?"

"ఎందుకు గురూ! స్పృహ రానీ, గులాబ్‌జాంలా వుంది."

"ఒరేయ్ నీకు బుద్ధిరాదు. మళ్ళీ ఆ మాట ఎత్తావో నాలుక చీరేస్తాను" అంటూ ఊర్మిళను భుజం మీదకు ఎత్తుకున్నాడు మరొకడు.

నెమ్మదిగా నడుస్తూ వాళ్లు గుర్రాలను చేరుకున్నారు. ఊర్మిళను గుర్రంముందు వేసి వెనక కూర్చున్నాడతను.

మరునిముషం గుర్రాలు ముందుకు ఉరికాయి. దుమ్ము లేపుకుంటూ ముందుకు దౌడ తీశాయి.

పావుగంట తరువాత గుర్రాలు ఒక చల్లని ప్రదేశానికి

వచ్చాయి.

ఊర్మిళ ఇంకా స్పృహలేనట్లే పడుకుని వుంది.

గుర్రాలు ఆగాయి. రౌతులు క్రిందకు దిగారు. ఒకడు ఊర్మిళను భుజంమీద వేసుకుని ముందుకు నడిచాడు.

"ఎవర్రా అది?" డబ్బాలోంచి రాళ్ళు దొర్లాయి. చాలా అసహ్యమయిన కంఠం.

"ఎవరో తెలియదు బాస్! మన సర్కిల్లో దొరికితే తెచ్చాం."

"సి. ఐ. డి. ఏమో?"

"లేదు బాస్! బెదురు గొడ్డు. మమ్మల్ని చూడగానే కళ్ళు తిరిగి పడిపోయింది. ఇంకా లేవలేదు."

"దాని దగ్గర ఏమయినా వున్నాయేమో! చూశారా?"

"లేదండి."

"ఛూ! యదవనాయాళ్ళులారా? ఎవడయినా దానికి ట్రాన్స్‌మీటరిచ్చి ఇక్కడికి పంపితే మన పని ఏమయిపోతుంది? దాని దగ్గర పిస్టలూ అదీ కూడా వుందేమో! చూడండి."

అతడు వినయంగా తలవూపి, ఎత్తుగా వున్న అరుగు మీద యెక్కాడు. ఊర్మిళను ఒక నులకమంచంమీద పడేశాడు. సోదా ప్రారంభించాడు.

ఊర్మిళ సిగ్గుతో చచ్చిపోయింది. ఆమె ఒళ్లంతా జర్రులు పాకినట్లయింది.

"ఏమీ లేదు బాస్!"

"అయితే దాన్ని ఆమూల గదిలో పడేసి బయట తాళం వెయ్యి! ఈ రాత్రికి నాకు పనుంది. రేపు రాత్రి దీన్ని విందు చేసుకుందాం!" ఖాదర్ బాబా చిద్విలాసంగా నవ్వాడు.

అనుచరుడు ఊర్మిళను మళ్ళీ భుజానికెత్తుకుని లోపలకు తీసుకువెళ్ళాడు. వాళ్ళా మంచంమీద పడేసి, తలుపు వేశాడు. గొళ్ళెం వేసి తాళం తగిలించాడు. తాళంచెవిని బాబాకు అందించాడు.

బాబా దానిని ఆప్యాయంగా అందుకుని జేబులో వేసుకున్నాడు.

చిన్నగా ఈలవేసుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు.

గదిలో ఊర్మిళ వెక్కి వెక్కి ఏడిచింది. అలా ఏడుస్తూనే నిస్త్రాణగా నిద్రలోకి జారుకుంది.

## 8

మధ్యాహ్నం మూడు గంటలయింది.

అవినాష్ రొప్పుతో పరుగెడుతోన్నాడు.

ట్రాన్సిమీటర్లోని ముల్లు కోతి వెళుతోన్న దిశను చూపిస్తోంది. ఆ ట్రాన్స్మీటరు శక్తి మూడు మైళ్ళవరకే వుంటుంది. కోతికీ తనకూ వున్న దూరం మూడు మైళ్ళు దాటిందా దాని జాడ తనకు తెలియదు. అందుకే శక్తినంతా కూడదీసుకుని మరీ పరిగెడుతోన్నాడు.

మీటరులోని ముళ్ళు వేగంగా కదులుతోంది. అంటే కోతి వేగాన్ని పెంచిందన్నమాట. దాని పరుగంతా నీటికోసమే.

కొంచెం కష్టపడితే బాబా స్థావరం దొరికిపోతుంది. అందుకే లేని సత్తువను కొని తెచ్చుకుని శక్తికొద్దీ పరుగెడుతోన్నాడు అవినాష్. అతని వళ్ళంతా చెమటలో తడిసిపోతోంది. దానికి సాయం వీపుమీద రెండు బరువయిన బ్యాగ్ లు అతని ఓపికను పరీక్షిస్తోన్నాయి.

ఉన్నట్టుండి ట్రాన్సిమీటరులోని ముల్లు కదలిక ఆగిపోయింది.

ఉత్కంఠతో అవినాష్ రోమాలు నిక్కబొడుచు కున్నాయి.

తన ప్రయత్నం ఫలించేనా?!

కోతి నీరున్న ప్రదేశాన్ని చేరుకుందా? లేక దాహంతో మధ్యలో నే చచ్చిపోయిందా? అనుమానాలతో అవినాష్ బుర్ర వేడెక్కిపోయింది.

ఒకక్షణం తరువాత మీటరులోని ముల్లు కదలటం ఆరంభించింది. కానీ ఈసారి కోతి పరుగెత్తటంలేదు. నెమ్మదిగా నడుస్తోంది.

అవినాష్‌లోని ఉత్సాహం అతనికి ఊపిరినిచ్చింది.

ఇప్పుడు తనకీ కోతికి మధ్య వున్న దూరం, రెండు మైళ్ళకంటే వుండదు.

అవినాష్ వేగాన్ని పెంచాడు.

మీటరులోని సంకేతాన్ని బట్టి తను కోతికి బాగా దగ్గరగా వచ్చేశాడు.

పావుగంట తరువాత ముల్లు నిశ్చలంగా వుండి పోయింది.

గమ్యాన్ని చేరానన్న సంతోషంతో అతడు అప్పటి వరకూ పడిన కష్టాన్ని మర్చిపోయాడు.

చుట్టూ పెద్ద పెద్ద కొండలూ, చెట్లూ, రాళ్ళ గుప్పలూ, పొదలూ—

ఆ ప్రాంతంలో కోతిగానీ, నీరుగాని ఎక్కడా కనిపించలేదు అవినాష్‌కు.

పదినిముషాలు ఆ ప్రాంతాన్నంతటినీ కలయతిరిగాడు. ఫలితంలేదు. మీటరులోంచి మాత్రం కోతి జాడ తెలుస్తూనే వుంది.

విచిత్రం — నీరు తాగాక కోతి అంతసేపు ఏం

చేస్తోంది. అది నీటికోసంకాక ఇక్కడ మరెందుకయినా వచ్చిందేమో!

అవినాష్ ఒక పెద్ద కొండదగ్గర ఆగాడు.

కోతి అక్కడే వుంది. కాని ఎలా సాధ్యపడుతుంది. కొండలో సొరంగంగానీ మరే యితర ఏర్పాటుగానీ వున్నట్టు తోచటం లేదు.

అవినాష్ ముందుకు అడుగులు వేశాడు.

కోతి వెనకబడిపోయింది.

మళ్ళీ వెనక్కు వచ్చాడు. మళ్ళీ మీటరు కోతి తన దగ్గరే వున్నట్లు చెబుతోంది.

వెనక్కు అడుగులు వేశాడు.

తను వెనకబడిపోయాడు.

మళ్ళీ ముందుకు వచ్చాడు. ఇప్పుడు కోతి తన పక్కనే వుంది.

ఈ మిస్టరీ అతనికి బోధ పడలేదు.

అతనికి ఎడంచేతి వయిపుగా పెద్ద చెట్టు వుంది. అవినాష్ నెమ్మదిగా ఆ చెట్టును ఎక్కాడు.

ఆశ్చర్యం—ఆ చెట్టు ముందునుంచి చల్లటి గాలి వీసి, అతడి నేద తీరింది

అవినాష్ నెమ్మదిగా చెట్టు దిగాడు. నేలను బాగా పరిశీలించి చూశాడు.

అతని కళ్లు ఆశ్చర్యంతో మెరిసాయి.

అక్కడ ఒక చిన్న బాట వుంది.

బాటను అనుసరిస్తూ ముందుకు సాగిపోయాడు అవినాష్.

అతడికి అక్కడి దృశ్యాన్ని చూసి మతిపోయింది. రెండు కొండల మధ్యన చిన్న నీటి కయ్య వుంది.

అక్కడ కోతి అటూ యిటూ గింజుకుంటోంది. దాని మెడకు వున్న తాడు రెండు రాళ్ళమధ్య యిరుక్కు-పోయింది. బయటకు రాలేక నానా బాధా పడుతోంది ఆ కోతి.

అవినాష్ దాని దగ్గరకు అడుగులు వేశాడు.

పరిచయమున్న వ్యక్తి తన దగ్గరకు వచ్చేటప్పటికి కోతి అతడిని ఆశ్చర్యంగానూ, ఆప్యాయంగానూ చూసింది.

అవినాష్ కోతి మెడలోని ట్రాన్స్‌మీటర్‌ను ఇప్పి, బ్యాగ్‌లో వేసుకున్నాడు. దాని మెడ తాడునుకూడా తొలగించాడు.

కోతి ఒక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యలేదు. ఉరుకులాంటి పరుగుతో ముందుకు పోయింది.

అవినాష్ కోతికి మనసులోనే ధన్యవాదాలర్పించుకున్నాడు.

అక్కడి వాతావరణానికి అవినాష్ ఆశ్చర్యపోయాడు.

పైకి కొండంతా ఒకటిగానే వుంది. ప్రక్కన మరో కొండతో కలసి వుంది. రెండు కొండల మధ్య నుండి కొంత దూరం నడిస్తే ఒక కొండ. ఎవరో కత్తితో కోసి, రెంటినీ దూరంగా జరిపినట్లుగా చీలిపోయి వుంది. పీఠ భాగం బాగా వెడల్పుగా వుండి పైభాగం కలసిపోయి వుంది.

పీఠ భాగం కొంత వంకరగా వుండి పోను పోనూ చదునుగా సమతలంగా ఏర్పడింది. వంకరగా వున్న భాగంలో చల్లటి స్వచ్ఛమయిన నీరు ప్రవహిస్తోంది. ఆ ప్రవాహం యెక్కడనుండి వచ్చిందో యెక్కడకు వెళుతోందో చెప్పటం కష్టం.

అవినాష్ నీటి ప్రవాహంలోకి అడుగులు వేశాడు.

మోకాలు కూడా మునగలేదు.

నీరు చాలా స్వచ్ఛంగా వుంది. అడుగున వున్న రాళ్ళూ, కర్రలూ పైకి స్పష్టంగా కనబడుతోన్నాయి.

పనిగట్టుకుని ఎవరయినా తనలా అక్కడకు వస్తే తప్ప ఎవరికీ అక్కడ నీటి ప్రవాహం వుందని గానీ, కొండలో బోలుందని గానీ తెలియదు.

అవినాష్ ముందుకు అడుగులు వేశాడు.

ముందుకు వెళుతోన్న కొద్దీ నేల వైశాల్యం పెరుగుతోంది.

ఒకచోట చిన్న మైదానంలా వుంది. అక్కడ దాదాపు పాతిక దాకా గుర్రాలు వున్నాయి. అవి గడ్డిని మేస్తోన్నాయి. చాలా బలంగావున్నాయి.

గుర్రాలను చూడగానే అవినాష్‌కు తను ఖాదర్ బాబా స్థావరానికి వచ్చానన్న నమ్మకం కుదిరింది. బ్యాగ్ లోంచి పవర్ ఫుల్ ట్రాన్స్‌మీటర్‌ను తీశాడు. కమీషనర్ శ్రీపతిని కాంటాక్టు చేశాడు.

అటువయిపునుండి కమీషనర్ గొంతు వినపడగానే, అవినాష్ అప్పటివరకు జరిగిన దానిని వివరించాడు. స్థావరం దగ్గరకు త్రోవను చూచాయగా చెప్పాడు.

"నేను ముందుకు వెళుతోన్నాను. స్థావరం మీకు తెలియటానికి వీలుగా ట్రాన్స్‌మీటర్‌ను ఆన్ చేసి వుంచుతాను" అని చెప్పి, ట్రాన్స్‌మీటర్‌ను ఎత్తుగా వున్న రాతి వెనక భాగంలో వుంచాడు.

"అమ్మయ్య! ఇప్పుడు తనకు ఏమయినా పరవాలేదు. ఖాదర్ బాబా స్థావరాన్ని పట్టిస్తోన్నాను."

అవినాష్ ముందుకు అడుగులు వేశాడు.

రెండువయిపుల ఎత్తయిన అరుగులు. అరుగులమీద నులకమంచాలు, పెద్ద పెద్ద మూటలూ, భోషాణాలూ, మందుగుండు సామానులూ, కత్తులూ, బట్టలూ.

అవినాష్ అరుగులవైపు ఒక సారి పరిశీలనగా చూశాడు.

నెమ్మదిగా ఒక అరుగు మీదకు యెక్కాడు. అరుగు నంతటినీ గాలించాడు. అనుమానించాల్సింది ఏమీ లేదు.

మొదటి అరుగు దిగి రెండో ప్రక్క అరుగును యెక్కాడు అవినాష్, నెమ్మదిగా పరిశీలించాడు. అరుగు చివరన మూడు గదులు వున్నాయి. రెండు గదులు తెరిచే వున్నాయి. అక్కడ చీకటిగా వుంది. బ్యాటరీ లైటుతో లోపల చూశాడు. లోపల చొక్కాలూ, లాగులూ, రగ్గులూ....వున్నాయి.

రెండో గదీ అంతే.

మూడో గదికి మాత్రం తాళం వేసి వుంది. చిన్న వూచతో తాళాన్ని తీశాడు. గొళ్ళెం తప్పించాడు. 'తలుపు తీద్దాం' అనుకునేలోగా బయట చప్పుడయింది. అవినాష్ చటుక్కున పక్క గదిలోకి దూరాడు.

తలుపు వెయ్యబోయాడు.

అంతే.

ఫట్ మని—తల అదిరిపోయే దెబ్బ తగిలింది. మాడు చిట్లింది. వెంటనే స్పృహ తప్పి క్రింద పడిపోయాడు అవినాష్.

## 9

బయట గొళ్ళెం చప్పుడయ్యేసరికి ఉలిక్కిపడి లేచి కూర్చుంది ఊర్మిళ.

ఒళ్ళంతా బద్ధకంగా వుంది. టయిమ్ యెంతయిందో తెలియదు. కనీసం అది పగలో రాత్రో కూడా తెలియదు. తనను తీసుకువచ్చి గదిలో పడేశారు. తను ఏడ్చింది. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు. ఇప్పుడు చప్పుడుకు మెలుకువ వచ్చింది.

ఊర్మిళ తలుపువైపు చూసింది. తెరుచుకోలేదు. ఆమె ఆశ్చర్యపోయింది. ఏమిటీ విచిత్రం, తలుపు గొళ్ళెంతీసిన వ్యక్తి తలుపును తెరవదేమిటి? గొళ్ళెం తీసిందెవరు? బాబా తిరిగివచ్చాడా? తనపని పట్టడానికి వస్తోన్నాడా? మరి లోపలకు ఎందుకు రాలేదు? ఆమె ఎటూ తేల్చుకో లేక పోయింది.

మెల్లగా మంచం మీదనుండి లేచింది. తలుపు దగ్గరకు అడుగులు వేసింది. తలుపును లాగింది. విచిత్రం? ఎవరో మంత్రించినట్లు తెరుచుకుంది తలుపు. తల బయట పెట్టి చూసింది. బయట ఎవరూ లేరు. 'వీళ్ళ గుంపదెగా! కాపలాకి ఒక్కడయినా లేడు! ఎంత ధైర్యం!" అను కుంటూ బయటకు వచ్చింది.

బయట పెద్ద అరుగులా వుంది. కొండను దొలచి చాలా ఆర్టిస్టిక్ గా ఆ అరుగును ఏర్పరచారు. ఆ అరుగుకు ఎదురుగా మరో అరుగు. తనను వుంచిన గదినికూడా కొండను దొలచే తయారుచేశారు. రెండు అరుగుల మధ్య నీరు పాయగా ప్రవహిస్తోంది. ఒక కొండ గుహ, అనే కన్నా ఒక పెద్ద గుడారం అనటం మంచిది.

ఊర్మిళ అడుగులు వేస్తో ముందుకు వెళ్ళింది. అరుగు చాలా పొడవుగా వుంది. చివరను చేరుకోవటానికి పది నిముషాలు పట్టింది. వెలుగు సన్నగా వుంది. ఆకాశం కనిపించటంలేదు. అరుగు చివరగా పెద్ద బండరాయి

వుంది. దానిమీద హంసతూలికా తల్పంమీద కూర్చున్న మహారాజులా కూర్చుని వున్నాడు ఖాదర్ బాబా. అతనికి కొంచెం దూరంలో కొండ మధ్యనుండి నీటి ధార పడుతోంది.

అరుగును ఆనుకుని పెద్ద మైదానంలా వుంది. ఆ మైదానం మధ్య, పెద్ద నెగడు వుంది. దానిమీద కొండ మేక మగ్గుతోంది. నెగడు చుట్టూ బాబా అనుచరులు కూర్చుని వున్నారు.

వాళ్ళకు కొంచెం ఎడంగా వున్న దృశ్యాన్ని చూసి ఊర్మిళ సంభ్రమించిపోయింది. అక్కడ అవినాష్ ను తాళ్ళతో కట్టేశారు. మామూలుగా కాదు — అతడిని తల క్రిందులుగా వ్రేలాడ కట్టారు. రెండు కాళ్ళను ఎడంగా లాగి పాదాలను పై కప్పుకు బిగించారు. మనిషి క్రిందకు వ్రేల్లాడుతోన్నాడు. అతడి ఒంటిమీద నూలుపోగయినా లేదు.

ఊర్మిళ కళ్ళనుండి నీళ్ళు రాలాయి. ఆమెలో ఆవేశం చోటు చేసుకుంది. నెమ్మదిగా ప్రక్కకు చూసింది. అక్కడ మిషన్ గన్నులు పడివున్నాయి. నెమ్మదిగా పాక్కుంటూ అక్కడకు వెళ్ళింది ఊర్మిళ. రెండు మిషన్ గన్నులను తీసుకుంది. తనను ఎవరూ చూడరు. బాబా అటువయిపు తిరిగి వున్నాడు.

“వక్రతుండ! మమ్మల్నే పట్టుకుందుకు వచ్చావన్న మాట. నిన్ను కత్తితో కండగా కోసి మీ కమీషనర్ కు రోజుకో ముక్కను పంపుతాను.” అని “ఒరేయ్ అప్పన్నా ఈ వాళ వీడి ఎడంచెయ్యి తెగ్గొట్రా!” అన్నాడు.

అప్పన్న అనేవాడు హుషారుగా లేచాడు. అతని

చేతులో తళ తళలాడే కత్తి వుంది. కత్తిని ఝుళిపించుకుంటూ ముందుకు వెళ్ళాడు. అవినాష్‌ను సమీపించాడు. ఎడం చెయ్యిని సున్నితంగా పిడిమాడు. కత్తిని పైకెత్తాడు.

అవినాష్ కళ్ళు మూసుకున్నాడు.

ఒక్క క్షణం ఆలస్యం అయితే చెయ్యి తెగిపోయేదే.

కానీ అంతలోనే "ఆగు!" అన్న గర్జన వినపడి వెనక్కి తిరిగి చూశాడు అప్పన్న.

బాబా ఆజ్ఞను విని విపరీతంగా కంపించిపోయింది ఊర్మిళ. ఇక తాత్సారం చెయ్యకూడదు. చప్పుడు చెయ్యకుండా బాబా వెనక్కి వెళ్ళింది. మెషిన్ గన్‌ను అతని వీపుకు ఆనించింది. "ఆగు" అని అప్పన్నను ఆజ్ఞాపించింది.

బాబా ఆశ్చర్యంతో వెనక్కి తిరగబోయాడు.

"కదిలితే చస్తావ్!" అంది కర్కశంగా—మెషిన్ గన్ బాబా వీపులో గుచ్చుకుంది.

"నీ అనుచరులందర్నీ లేచి నిలబడమను!"

బాబా పళ్ళు నూరాడు! అతని మొహం కోపంతో కందగడ్డలా మారిపోయింది.

"నిన్నా!"

"ఒరేయ్! మీ యవ్వ! లెగండిరా!"

అనుచరులంతా లేచి నిలబడ్డారు.

"చేతులు పైకెత్తమను!"

"మిమ్మల్నే."

అందరి చేతులూ పైకి లేచాయి.

"ఆయన కట్లు విప్పమను! ఊ!"

"ఒరే అప్పి నాయాల! మనిసివి గాదేంట్రా అణ్ణి

దించు!"

అవినాష్ కట్లు విప్పాడు అప్పన్న. నెమ్మదిగా క్రిందకు దించాడు.

అవినాష్‌కు జరుగుతోన్నది అర్థంకావటంలేదు. గబగబా ప్రక్కనే వున్న బట్టలు కట్టుకొన్నాడు. క్రింద వున్న మిషన్ గన్‌ను అందుకుని, బాబా అనుచరులను కవర్ చేశాడు.

ఈలోగా బయట నుండి ఒకడు పరుగెట్టుకు వచ్చాడు.

"బాస్! హెలికాప్టర్లో పోలీసోళ్ళు వస్తున్నారు" అన్నాడు రొప్పుతూ.

లోపల కలకలం బయలుదేరింది.

"కదిలారా! చస్తారు!...." అవినాష్ కంఠం ఉరిమింది.

ఖాదర్ బాబా ఏదో అనబోయాడు.

ఈలోగా కమీషనర్ శ్రీపతి తన అనుచరులతో రంగప్రవేశం చేశాడు. ఖాదర్ బాబానూ అతని అనుచరులనూ బంధించారు.

"వెల్! మిస్టర్ అవినాష్! నువ్వు ఆన్ చేసి వుంచిన ట్రాన్స్‌మీటరు సాయంతో మేము యిక్కడకు త్వరగా రాగలిగాం. దానికి తోడు, వీడి అనుచరుడు మమ్మల్ని చూసి కంగారుపడుతూ ఇక్కడకు పరుగెట్టుకొచ్చాడు. వాడిని అనుసరిస్తూ, మేము సరాసరి ఇక్కడకి చేరుకున్నాం. ఎనీ హౌ కంగ్రాట్స్! నువ్వూ, అమ్మాయీ, ప్రాణాలకు సైతం లెక్కచెయ్యకుండా యీ ప్రమాదకరమయిన పనిని సాధించారు" కమీషనర్ శ్రీపతి వారిరువురినీ అభినందించాడు.

—: అయిపోయింది :—

సీరియల్

వి.యస్.రావ్



(గత సంచిక తరువాయి)

అతనివైపు ఏదో అరవబోతూ మనోజ్ ఆగాడు. భరత్ ఆరితేరిన వ్యక్తిలా వున్నాడు. పైన చిన్నగా చప్పుడైంది. తాడు గోడవారగా పాములా కిందికి పాకుతోంది. గుడ్! భరత్ తాడుని ఉపయోగించి, కిందికి దిగబోతున్నాడు.

“భరత్! వచ్చేయ్!” మనోజ్ చిన్నగా అరిచాడు. కానీ అతని మాటని పిస్టల్ షాట్ మింగేసింది. మనోజ్ ఉలిక్కిపడి, కంగారుగా పైకి చూశాడు. భరత్ తూలి పడబోతూ, తాడు ఆధారంతో జరజరా కిందికి దూసుకొస్తోన్నాడు. మరుక్షణంలో తన దగ్గరగా కిందికి వాలిన భరత్ భుజమ్మీద మనోజ్ చెయ్యి వేశాడు.

“భరత్.... గాయపడ్డావా?” వణికే కంఠంతో

ప్రశ్నించాడతను.

భరత్ రొప్పుని ఆపుకుంటూ తల విదిల్చాడు. తటాలున లేచి, నిలబడ్డాడు. "కుక్క కాల్చి కరిచేసింది. ఆల్ రైట్ ....పద! తొందరగా....!" బొంగురుగా అన్నాడతను.

* * *

మనోజ్ కదిలాడు. గోడ అవతల నుంచీ యెవరో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళు ఏ నిచ్చెననో ఉపయోగించి, ఇటువైపు దూకొచ్చు. గేటువైపు పరుగెత్తి, ఇటువైపు రావొచ్చు. తనకి ఆట్టే వ్యవధి లేదు. మనోజ్ రోడ్డువైపు పరుగెట్టసాగేడు. అప్పటికే విభీషణ్ ఎలుగుబంటిలా ముందు పరుగెడుతున్నాడు.

తన వెనుక వస్తున్న భరత్ వొగరుస్తూ చేస్తున్న శబ్దం మనోజ్‌కి వినిపిస్తోంది. గాయం తగిలిన భరత్ ప్రాణం కోసం పరుగెడుతున్నాడు!

రోడ్లోంచీ సందులోకి మలుపు తిరిగి మనోజ్ యెదురుగా చూశాడు. విభీషణ్ అప్పుడే కుడివేపు తిరుగుతున్నాడు! మనోజ్ చెవులు రిక్కించాడు. భరత్ చేస్తోన్న శబ్దాలు తప్ప, మరే చప్పుళ్ళూ వినపడ్డంలేదు. ఇంకా తమని వాళ్ళు వెంటాడ్డంలేదు....

మనోజ్ మరో మలుపు తిరిగాడు. పడుతూ లేస్తూ ముందు వెళ్తున్న విభీషణ్‌ని చూస్తూ నవ్వుకుంటూ గోడవారగా ఆగాడు. వెనుకనుంచీ భరత్ అడుగుల చప్పుడు తప్ప మరేం వినపడ్డంలేదు. వాళ్ళెందుకు రాలేదు? సందులమ్మట రాకుండా తిన్నగా వెళ్ళిపోయారా? ఆలోచిస్తోన్న మనోజ్ ఉలిక్కిపడ్డాడు. దబ్ మంటూ చప్పుడైంది.

మనోజ్ ఆదుర్దాగా చూశాడు. కొద్దువారగా, భరత్ బస్తాలా పడున్నాడు. మనోజ్ అతనివైపు పరుగెట్టాడు. భరత్ మూలుగు అతనికి తగ్గుస్వరంలో వినిపిస్తోంది. మనోజ్ అతని దగ్గరగా కిందికి వంగాడు.

"భరత్ ...."

భరత్ మూలిగాడు. "బుల్లెట్ ....వీపులో ....దూరి నట్టుంది....ఓహ్....కారు....కారు తెచ్చావా?" తగ్గు స్వరంలో అగి భరత్ దగ్గడం ప్రారంభించాడు.

మనోజ్ అతని భుజమ్మీద చెయ్యి వేశాడు. దగ్గు ఆపేసిన భరత్ నిశ్శబ్దంగా పడున్నాడు మనోజ్ అతని దగ్గరగా, నేలమీద గొంతుకూర్చున్నాడు. అతని ముంజేతిని పట్టుకుని నాడిని పరీక్షించే ప్రయత్నం చేశాడు. అతని వేళ్ళకి చల్లగా గట్టిగా ఏదో తగుల్తోంది. ఏదో కడియం. దాన్ని పక్కకి తోస్తూ వేళ్ళని అతని నాడిమీద వుంచాడు. నాడి బలహీనంగా కొట్టుకుం టోంది.

"భరత్ ...." మొహం దగ్గరగా వంగి, మనోజ్ పిలిచాడు.

".... నేను .... నేను ....భరత్ కాదు .... బాబ్జీని .... ఆస్పత్రి.... డాక్టర్ ...." పలవరిస్తున్నట్టుగా గొణిగా డతను.

భరత్ కాదు! బాబ్జీ!....మనోజ్ ఆశ్చర్యంతో ఉలిక్కిపడ్డాడు. విరూపాక్షరావు ఇతని పేరుని మార్చి ఎందుకు చెప్పాడు? అతని అనుచరులు రెండుమూడు పేర్లతో జీవిస్తున్నారా? ఎందుకు?

ఆలోచిస్తూ మనోజ్ మళ్ళీ అతని నాడిని పరీక్షించ డానికి వేళ్ళు చాచాడు. మళ్ళీ చల్లగా ఏదో, అతని

చేతికి తగిలింది. మనోజ్ చేతిని తిటాలున వెనక్కి లాక్కు న్నాడు. అతని మెదడులో ఏవో తారాజువ్వల్లా మాసు కొట్టున్నాయి.

మనోజ్ మళ్ళీ అతని మణికట్టుని పట్టుకున్నాడు. అతన్ని కుదుపుతూ కంగారుగా పిలిచాడు. "భరత్.... బాబ్జీ...."

జవాబుగా బాబ్జీ మూలిగాడు.

"బాబ్జీ ...నిజం చెప్తే నిన్ను డాక్టర్ దగ్గరికి తీసు కెళ్తా . లాయర్ రంగనాధం భార్యను గాయపరిచింది నువ్వేనా?" మనోజ్ అతని చెవిదగ్గరగా అన్నాడు.

బాబ్జీ కంఠం గుర్రు గుర్రుమంటూ చప్పుడు చేసింది. అతను శరీరం సగానికి తెగిన పాములా కదుల్తున్నాడు. మనోజ్ అతని చేతిని నొక్కుతూ మళ్ళీ అడిగాడు.

"ఊ ... నే.... నే...." బాబ్జి మూలిగాడు.

మనోజ్ వేళ్ళు అప్రయత్నంగా అతని మణికట్టు చుట్టూ బిగుసుకున్నాయి. అతని శరీరం వణుకుతోంది.

"ఎందుకు?" మనోజ్ అసంకల్పితంగా గర్జించాడు.

బాబ్జీ మాట్లాడలేదు. బాధతో మూలుగుతూ వుండి పోయాడు.

మనోజ్ ఎడమచెయ్యి బాబ్జీ చొక్కా ముందు భాగాన్ని గట్టిగా బిగించి పట్టుకుంది. అతన్ని కొంచెం పైకిలేపుతూ మళ్ళీ అడిగాడు మనోజ్: "ఎందుకు? చెప్పు!"

"బాస్ .... బాస్ .... చెప్పాడు........" బాబ్జీ గుస గుసగా అన్నాడు.

"బాస్ ఎవరు?" మనోజ్ మళ్ళీ అడిగాడు. బాబ్జీ కంఠంలో గురక ప్రారంభమైంది. మనోజ్ ప్రశ్న విని పించని ఏదో ప్రదేశంలో వున్నాడతను. మనోజ్ అదే

ప్రశ్నని పదేపదే అడుగుతూ వుండిపోయాడు. చెవిలో ధ్వనిస్తున్న మనోజ్ కంఠం బాబ్జీని ఈ లోకంలోకి లాక్కొచ్చింది. అర్థరహితంగా ఏమిటో గొణుగుతున్నాడు డతను.

"బాబ్జీ.... చెప్పు! బాస్ ఎవరు?" మళ్ళీ అరిచాడు. చెవిని బాబ్జీ నోటికి దగ్గరగా వుంచాడు.

"వి....రూ....పా....క్ష....రా...." బాబ్జీ యమ ప్రయత్నంతో ఒక్కో అక్షరాన్నే పలుకుతూ ఆగాడు. మనోజ్ చెవికీ, చెంపకూ వెచ్చటి జల్లు తగిలింది బాబ్జీ కక్కుతున్న రక్తం!

మనోజ్ చెయ్యి అతని చొక్కాని వదిలేసింది. బాబ్జీ తల నేలమీదికి వాలింది. మనోజ్ ఎడమచేతిని అతని ఛాతీమీదికి జరిపాడు. అతని గుండె విశ్రాంతి తీసుకుంటోంది...

తన కుడిచేతి వేళ్ళకి చల్లగా తగులుతున్న గొలుసుని బలంగా ఇవతలికి లాగాడు మనోజ్. రోడ్డుమీద పడున్న తన రివాల్వర్ని అందుకొన్నాడు.

బాబ్జీ తను యిచ్చిన రివాల్వర్ కోసం వెతికాడు. అతని చేతుల్లో, శరీరంమీదా రివాల్వర్ లేదు. అతను ఎక్కడో జారవిడిచి వుంటాడు. మనోజ్ మెల్లగా లేచాడు.

తన వేళ్ళమధ్య ఇరుక్కున్న గొలుసుని కసిగా నొక్కుతూ జేబులో పడేసుకున్నాడు.

దూరంగా ఏదో కారు స్టార్టయిన శబ్దం వినిపిస్తోంది. మనోజ్ బాబ్జీ శవాన్ని అలాగే వదిలేసి, వేగంగా పరుగెత్తసాగేడు. రెండు మలుపులు తిరిగి. మెయిన్ రోడ్డు అంచుకి చేరుకున్నాడు. జాగ్రత్తగా రెండడుగులు

ముందుకి వేసి, తను కారు ఆపిన చెట్టువేపు తలవాల్చి చూశాడు.

కారు లేదు!

• • •

మాయమైన కారు గురించి ఆశ్చర్యంతో ఆలో చిస్తోన్న మనోజ్‌ని అడుగుల చప్పుళ్ళు దూరం నుంచీ హెచ్చరించాయి.

అతను ఎడంవేపున్న సందులోకి పరుగుతీశాడు. దగ్గర దగ్గరగా వున్న ఇళ్ళమధ్య అడ్డంగా, నిలువుగా సాగి పోతున్న సందులమ్మట వేగంగా పరుగెడుతూ వుండి పోయాడు.

నిమిషాలు దొర్లుతున్నాయి. మలుపులు తిరుగుతూ మనోజ్ తనకీ, తనని వెంటాడేవాళ్ళకీ మధ్య దూరాన్ని పెంచుతున్నాడు. కాలువలు కట్టుతున్న చెమట అతని శరీరాన్ని స్నానం చేయిస్తోంది. మెయిన్ రోడ్‌లోకి వెళ్ళకుండా అతను జాగ్రత్తపడుతున్నాడు.

వాళ్ళు యెంత వేగంగా పరుగెట్టినా తనని అందుకో లేరని అతనికి తెలుసు. త్వరలో పరుగుకు స్వస్తి చెప్పి వాళ్ళు కారెక్కుతారు. వెడల్పాటి రోడ్డులోకి ప్రవే శించనంతకాలం కారులో కూడా వాళ్ళు తనని అందుకో లేరు...

మలుపు తిరిగి మనోజ్ ఆగాడు.

ఊపిరి వేడిగా అతని ముక్కుల్లోంచీ బైటపడు తోంది. అరచేత్తో మొహాన్ని తుడుచుకుని మనోజ్ రిస్టు వాచీ చూశాడు. దాదాపు ముప్పావుగంట తను ఆప కుండా పరుగెట్టాడు! ఆ ప్రదేశం నుంచీ తను చాలా దూరం వచ్చేశాడన్నమాట.

మనోజ్ చెవులు రిక్కించాడు. అవాంఛితమైన శబ్దాలేవీ వినిపించడంలేదు.

సందులోంచీ మెయిన్ రోడ్డులోకి కదిలాడు. పరిశీలనగా చూశాడు. చిరునవ్వుతో అతని పెదవులు విచ్చుకున్నాయి. రంగులరాట్నంలా తిరిగినా తను ఆ ప్రదేశం నుండీ దూరంగా వచ్చేశాడు. తను టూ టౌన్‌లో వున్నాడు. మామూలుగా నడిస్తే తన హోటల్ గది చేరుకోడానికి పావుగంటకన్నా పట్టదు. రోడ్డు దాటి మరో సందులోకి ప్రవేశించాడతను.

వేగంగా అడుగులేస్తున్న మనోజ్ తటాలున ఆగాడు. తను తీసుకువచ్చిన కారు మాయమైంది. విరూపాక్షరావు నిజస్వరూపం భరత్—బాబ్జి ద్వారా తనకి తెలిసింది. తనకి తెలిసినట్టు కారు తీసుకుని ఉడాయించిన వ్యక్తికి తెలుసా? విరూపాక్షరావుకి తెలుసా?

ప్రాణాలు పిడికిట్లో పట్టుకుని పరుగెడుతున్న ఆ వ్యక్తి ఆగి, తన అనుచరుడు ప్రాణాలు వదుల్తూ చెప్పిన మాటల్ని విన్నాడా? ఆలోచిస్తూంటే అది అసంభవమనిపిస్తోంది మనోజ్‌కి. అయినా యేదో అనుమానం అతన్ని ముల్లులా గుచ్చుతోంది. మనోజ్ నడక ప్రారంభించాడు. ఏమీ తెలీనట్టు నటించడం తనకి మంచిది.

విరూపాక్షరావు అసలు రూపం తెలిసినట్టు తను ప్రవర్తిస్తే, అది తనకి ఆటంకం అవుతుంది. విరూపాక్షరావు చుట్టూ కోట కట్టుకుని, అనుక్షణం తనని హత మార్చడానికి ప్రయత్నిస్తాడు! తను నటించే అమాయకత్వం తనకి కవచంలా ఉపయోగిస్తుంది. నివురు కప్పిన నిప్పులా అది తనని దాచి వుంచుతుంది!

విరూపాక్షరావ్! మనోజ్ అప్రయత్నంగా పళ్ళ

కొరుక్కున్నాడు. రాక్షసుడు! తెలివిగా తనని వుపయోగించుకున్నాడు. మేకతోలుని అడ్డంగా పెట్టుకొని తన పులిరూపాన్ని మరుగుపరిచాడు. అనుచరుల్ని రక్షించుడానికి తనని ఆయుధంగా వాడుకున్నాడు!

మనోజ్ పిడికిళ్ళు ఆవేశంగా బిగుసుకున్నాయి.

* * *

ఉదయం తొమ్మిది కావస్తోంది.

మనోజ్ గదిలో పచార్లు చేస్తున్నాడు. ఆలోచనలతో అతని బుర్ర వేడెక్కుతోంది. ఇంతకాలం తను విరూప్ ఇంటర్నేషనల్ ఫీల్డాఫీసర్ గా ఈ హోటల్ గదిలో వున్నాడు. విరూపాక్షరావు యేర్పాటు చేసిన విడిదిలో యింకా వుండటానికి యెందుకో మనస్కరించడంలేదు. హోటల్ పూర్తిగా అతని చేతిలో ఉన్నట్టుంది....

మనోజ్ సిగరెట్ వెలిగించాడు. తను మరోచోటికి మారిపోతే విరూపాక్షరావు అప్రమత్తుడవుతాడు. తనకి అంతా తెలుసని తెలుసుకుంటాడు. అది తనకి ప్రమాదం. వేటాడాల్సిన తను వేటాడబడకుండా కాపాడుకోవడంతోనే సరిపోతుంది! మనోజ్ లో యేదో ఆలోచన మెరిసింది.

సోఫాలో కూచుని టెలిఫోన్ రిసీవరెత్తాడు. హోటల్ మేనేజర్ కి కనెక్షన్ ఇమ్మన్నాడు. కనెక్షన్ రాగానే మేనేజర్ని గదికి రమ్మన్నాడు. అసహనంగా లేచి పచార్లు ప్రారంభించాడు. నిమిషాలు గడుస్తున్నాయి....

తలుపుమీద వేళ్ళ కణుపులు చప్పుడు చేశాయి. మనోజ్ గబగబా వెళ్ళి తలుపుని కొద్దిగా తెరిచి గుమ్మం ముందు నిలబడ్డ హోటల్ మేనేజర్ని చిరునవ్వుతో

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 99/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి!

చూశాడు.

తలుపుని బార్లా తెరిచి, అతను లోపలికి రాగానే మూసి గొళ్ళెం పెట్టేశాడు.

హోటల్ మేనేజర్ మౌనంగా, ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు.

సోఫాలో కూచుని మేనేజర్ని నవ్వుతూ చూశాడు.

"కూర్చోండి!"

హోటల్ మేనేజర్ రిమ్‌లెస్ అద్దాలగుండా విసుగ్గా చూశాడు "నాకు పనుంది. ఏమిటో చెప్పండి!"

మనోజ్ మొహంమీద చిరునవ్వు మాయమైంది. "మిస్టర్ గుర్నాధం నాకో బుల్‌డాగ్ కావాలి!"

గుర్నాధం అర్థంకానట్టు చూశాడు. అతని కనుబొమలు మధ్యలో కల్సుకున్నాయి.

"మాది హోటల్ వ్యాపారం; కుక్కల వ్యాపారం కాదు!" అతని కంఠంలో చిరాకు స్పష్టంగా ధ్వనించింది.

మనోజ్ ఆశ్చర్యంగా చూశాడు. మేనేజర్ అమాయకుడా? నటిస్తున్నాడా? తనని కన్సుకోవాల్సి వస్తే మేనేజర్ని "బుల్‌డాగ్ కావాలి!" అని అడగమన్నాడు విరూపాక్షరావు....

"మిస్టర్ గుర్నాధం, విరూపాక్షరావుగారు...." మనోజ్ ఏదో చెప్పబోయాడు.

"ఎవరతను?" గుర్నాధం అడ్డొస్తూ విసుగ్గా అడిగాడు.

మనోజ్ సోఫాలో వెనక్కి వాలాడు. కళ్ళు చిట్లిస్తూ గుర్నాధాన్ని చూశాడు. గుర్నాధం అసహనంగా కదుల్తున్నాడు.

"విరూపాక్షరా వెవరో మీకు తెలీదు. కనీసం నేను తెలుసా? మనోరంజన్, ఫిల్మాఫీసర్, విరూప్ ఇంటర్నేషనల్స్...."

మేనేజర్ విడ్డూరంగా చూశాడు. కళ్ళద్దాల్ని తీసి చేత్తో పట్టుకున్నాడు. "మిస్టర్ మనోజ్, మీ ఆరోగ్యం బాగున్నట్టు లేదు! మీ పేరు మార్చి యెందుకు చెప్తున్నారో నాకు అర్థంకావడంలేదు. మీరు చెప్తున్న కొత్త పేరూ, హోదా ఇవేమీ నాకు తెలీదు! యూ బెటర్ సీ ఎ సైకియాట్రిస్టు! కావాలంటే...."

మనోజ్ తటాలున లేచి నిలబడ్డాడు. గుర్నాథం కళ్ళలోకి శూలాలతో పొడుస్తున్నట్టు చూశాడు. "మనోరంజన్ పేరుతో నేను ఇక్కడ దిగాను. నా కారు మీ గారేజీలో వుంది...."

గుర్నాథం బరువుగా నిట్టూర్చాడు. "మిస్టర్ మనోజ్, అయామ్ సారీ ఫర్ యూ! సూట్‌కేస్ మోసుకుని, కాలినడకన మీరు మా హోటల్‌కి వచ్చారు.... ఆల్‌రైట్....మీరున్న స్థితిలో నేను మీతో మాట్లాడి లాభంలేదు. సైకియాట్రిస్టు సంజీవరావుని ఇక్కడికి పిలిపిస్తాను...."

"నో థాంక్స్!" మనోజ్ అడ్డొస్తూ అరిచాడు. "మిస్టర్ గుర్నాథం, సారీ. మీకు కష్టం కలిగించాను. ఏదో అర్జెంటు పనుందన్నారు. వెళ్ళండి! ఇంకా నేను మీతో మాట్లాడితే, సైకియాట్రిస్టు దగ్గరకు కాదు; పిచ్చాసుపత్రికి వెళ్ళాల్సి వుంటుంది!"

గుర్నాథం మొట్టమొదటిసారిగా చిరునవ్వు నవ్వాడు. కళ్ళద్దాల్ని తగిలించుకుంటూ మెల్లిగా వెనక్కి తిరిగాడు. గున్న ఏనుగులా నడుస్తూ వెళ్ళిపోయాడు.

మనోజ్ సోఫాముందు స్తంభంలా నిలబడిపోయాడు. విరూపాక్షరావు తను ఊహించినదానికన్నా స్పీడుగా వ్యవహరిస్తున్నాడు. ఈ హోటల్లో తన ఉనికి అవసరం లేదని తనకి పరోక్షంగా తెలియజేయబడింది! అంటే, విరూపాక్షరావు బైటపడిపోయాడు. ఎందుకు? తనని దూరంగా తోసేస్తున్నాడు. ఎందుకు? సగం కాలిన సిగరెట్ ని దూరంగా విసిరి మనోజ్ పచార్లు ప్రారంభింభించాడు.

రెండు అరచేతుల్తో కణతల్ని నొక్కుకున్నాడు మనోజ్. తను ఈ గదిలో వుండాలా? మరోచోటికి బిచాణా ఎత్తేయాలా?

అతని ప్రశ్నకి సమాధానం చెప్తున్నట్టు టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ని లాగి చెవికి ఆనించాడు మనోజ్.

"యస్?"

"రిసెప్షన్.... మిస్టర్ మనోజ్, నెల దాటినా మీరు అకౌంట్ ఫైనలైజ్ చేయలేదు...."

"వాట్!" మనోజ్ ఆశ్చర్యంగా అరిచాడు.

"బిల్లు తొమ్మిదివేలు దాటింది...." రిసెప్షనిస్టు కంఠం ఆక్షేపణగా ధ్వనించింది.

"వాట్!"

"వెంటనే పేమెంట్ అరేంజ్ చేయండి. ఆడిట్ ఇబ్బందు లున్నాయి...."

మనోజ్ కింది పెదవిని పంటితో నొక్కుకుంటూ కాసేపు మౌనంగా వుండిపోయాడు. విరూపాక్షరావు ఖచ్చితంగా దగాకోరు! స్కౌండ్రల్! తన మీద సాన పెట్టడానికి చాలా శక్తులు సిద్ధంగా వుంచుకున్నట్టున్నాడు....

(ఇంకా వుంది)

